# కవితా సంకలనం

(నన్నయ—వీరేశలింగం)

సంకలనకర్త

**డాక్టర్ ఎల్. చక్రధరరావు**

డైరెక్టర్, తెలుగు వ్యుత్పత్తికోశ పథకం




౧౯౭౭

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు
వాల్తేరు

# విషయసూచిక

# తొలిపలుకు

ఆంధ్రవిశ్వకళాపరిషత్ స్వర్ణోత్సవసందర్భంలో అనేక గ్రంథాల్ని ప్రకటించాలనీ, ప్రముఖులచేత అనేకోపన్యాసాల్ని ఇప్పించాలనీ విశ్వవిద్యాలయం నిర్ణయించింది. ఈ నిర్ణయానుగుణంగా ప్రకటించబడే గ్రంథసముదాయంలో ఈ 'కవితాసంకలనం (నన్నయ – వీరేశలింగం)' ఒకటి. ఈ సంకలనకర్త డాక్టర్ ఎల్. చక్రధరరావు, డైరక్టర్, తెలుగువ్యుత్పత్తికోశపథకం, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, ప్రాచీనకవులలో సుప్రసిద్ధులైన ఏభైమంది కవుల్ని తీసుకొని వారిగ్రంథాల్లోని ఉత్తమోత్తమపద్యాల్ని ఎంచి సంకలనం చేశారు. ఇందులోని ప్రతి కవిని గురించి సంగ్రహపరిచయం ఇవ్వడం జరిగింది. ప్రతి పద్యానికి ఆకరం చూపబడింది. గ్రంథంచివర క్లిష్టమైన తెలుగు పదాలకు అర్థాలివ్వబడ్డాయి. నూతన దృక్పథంతో వెలువరించబడుతున్న ఈ కవితాసంకలనం ప్రాచీనాంధ్ర సారస్వత విహంగావలోకనానికి ఉపయోగపడ గలదనీ, సర్వజనాదరణపాత్రం కాగలదనీ ఆశిస్తున్నాను.

వాల్తేరు,
ది. 17–5–1977

యమ్. ఆర్. అప్పారావు
ఆంధ్రవిశ్వకళాపరిషదుపాధ్యక్షులు

# 1

## నన్నయభట్టు

నన్నయభట్టు క్రీ శ. 1022 నుంచి 1062 వరకు పరిపాలించిన రాజరాజ నరేంద్రుని ఆస్థానకవి. ఇతడు ప్రథమాంధ్రకవి. ఈ కవి భారతంలోని ఆది సభాపర్వాల్ని అరణ్యపర్వంలో మూడాశ్వాసాలపై నూటనలభై రెండు పద్యాల్ని రచించాడు. నన్నయ్య 'చాముండికా విలాసము,' 'ఆంధ్రశబ్దచింతామణి,' 'ఇంద్ర విజయము,' 'లక్షణసారము,' 'రామాభ్యుదయము' అనే గ్రంథాల్ని రచించినట్లు కొందరు భావిస్తున్నారు. ఈ కవి అక్షరరమ్యతకు, నానారుచిరార్థసూక్తి నిధిత్వానికి పేరెన్నికకన్నవాడు.

1. శ్రీవాణీగిరిజాశ్చిరాయ ధధతో వక్షోముఖాఙ్గేషుయే
లోకానాం స్థితిమావహన్త్య విహతాం స్త్రీపుంస యోగోద్భవామ్
తేవేదత్రయ మూర్తయ స్త్రిపురుషాస్సంపూజితావస్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజ భవశ్రీ కన్ధరాశ్శ్రేయసే.

—భార. 1-1-1

2. వగవఁగ సాంగోపాంగము
లగు నాలుగు వేదములయు నధ్యయనము పొ
ల్పుఁగ నొక సత్యముతోనైన
యగునే? యెవ్వియును బోలవట సత్యంబున్.

—పైది. 3-2-83

3. జలధివిలోల వీచివిలసత్కల కాంచి సమంచితావనీ
తల వహనక్షమంబయిన దక్షిణ హస్తమునం దదున్న మ
ద్గళ దురుఘర్మవారి కణ క్రమ కరాబ్జము పట్టి నూతిలో
వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్.

—పైది. 1-3-144

4. మదమాతంగ తురంగ కాంచనలసన్మాణిక్య గాణిక్య సం
పదలోలిం గొని వచ్చి యిచ్చి ముదమొప్పం గాంచి సేవించి ర
య్యుదయాస్తాచల సేతు శీతనగమధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయున్ ధర్మజుఁ దత్సభా స్థితుజగత్పూర్వ ప్రతాపోదయున్.

—పైది. 2-1-18

5. శారదరాత్రులుజ్జ్వల లసత్తర తారక హారపంక్తులం
జారు తరమ్ములయ్యె, వికసన్నవకైరవ గంధ బంధురో
దార సమీర సౌరభము దాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూర పరాగ పాండు రుచిపూరములంబరి పూరితంబులై.

—పైది. 3-4-142

# 2

## నన్నిచోడకవి

క్రీ.శ. 1130 ప్రాంతంవాడైన కవిరాజశిఖామణి నన్నిచోడకవి 'కుమారసంభవము' అనే గ్రంథాన్ని రచించాడు. సరళభావాల్ని జానుతెనుగులో కర్ణరసాయనంగా ఈ కవిరాజశిఖామణి వెలయించాడు. 'కుమారసంభవము' ప్రబంధకవిత్వానికి ఒరవడిపెట్టింది.

1. కరిణీబృందముఁబాసియొక్క మదనాగం బద్రిరత్నోరుకం
దర సంక్రాంత నిజప్రభాతిఁ బ్రతివేదండంబుకాఁజూచి దు
ర్ధర రోషంబునఁ బోరు చుండె నతిమాత్సర్యంబునందామహే
శ్వరు శైలేంద్రముతోడ నీలగిరి వెల్బంబోరునట్లున్నతిన్.

—కుమా. 1-89

2. అతని శరాసనంబు కనకాచలమిక్షు శరాసనంబు నీ;
కతనికి నమ్ము పాశుపతమంటినఁగందెడు పూవులమ్ము నీ;
కతఁడు పురాపహారి విరహాతుర పాంథజనాపహారి నీ;
వతనికి నీకు హస్తి మశకాంతర మెమ్మెయి నెన్నిచూచినన్.

—పైది. 4-72

3. పరమానందుఁడ నిందితాచరణుఁడ భ్రాంతుండు శాంతుండు దు
ర్ధర సంసారసుఖోరుభూరితరకాంతారాంతరోద్భూత సం
కర కర్మేంద్రియ దుష్టనత్త్వభవ సంగత్యక్త సువ్యక్త భా
సుర బోధాత్మకుఁడాత్మతత్త్వగతి సంశుద్ధుండు సిద్ధుండిలన్.

—పైది. 7-158

4. తనుమధ్యయోపదీగురు
ఘనకుచభారంబు డాల్పఁగా ననియజుఁ డి
మ్మున నీల మణి కణిక దీ
ర్చిన క్రియ నూగారు దీగ చెలువకు నమరున్.

—పైది. 8-17

5. వెలుఁగు కుమారుతేజమున వేఁడిమిడాఁకినయంత వేయు గ
న్నులు మిఱుమిట్లు వోయినఁగనుంగొన నేరక మూసికొన్న ఱె
ప్పలు గమరంగనిల్చె నురుభాస్కర తీవ్రకర ప్రభాతిఁ గ
న్నులికి రయంబునన్మొగిడియున్న కుముద్వతివోలె భీతితో.

—పైది. 10-62

# 3

## పాల్కురికి సోమనాథకవి

క్రీ.శ. 1160 – 1240 మధ్యకాలంవాడైన పాల్కురికి సోమనాథుడు 'అనుభవసారమ 'బసవపురాణము,' 'పండితారాధ్యచరిత్రము,' 'వృషాధిపశతకము,' 'చతుర్వేదసారము,' 'రు భాష్యము' మొదలైన అనేక గ్రంథాల్ని రచించాడు. ఈ కవి ద్విపదవాఙ్మయ ప్రవర్తకుల్లో ఆద్య దేశసంప్రదాయాన్ని సంరక్షించినవారిలో అగ్రేసరుడు.

1. ఉరుతరగద్య పద్యోక్తులకంటె
నరసమై పరఁగిన జానుఁదెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్యమగుటఁ
గూర్చెద ద్విపదలు గోర్కిదైవాఱఁ
దెలుఁగు మాటలనంగవలదు ; వేదముల
కొలఁదియగాఁజూడుఁడిల నెట్టులనినఁ
బాటితూమునకును బాటియౌనేనిఁ
బాటింపసోలయుఁ బాటియకాదె
అల్పాక్షరముల ననల్పార్థరచన
కల్పించుటయెకాదె కవి వివేకంబు.

—బసవ. 165-1

2. సన్నుతిఁజేయుచు సత్కవులలరఁ
దిన్నని సూక్తుల ద్విపద రచింతు
నదియును గాకైహికాముష్మికద్వి
పదహేతువవుట ద్విపద నాఁగఁబరఁగు
ద్విపదాంబురుహముల ధృతిబసవేశు
ద్విపదాంబురుహము లతిప్రీతిఁ బూన్తు.

—పండితా. దీక్షాప్రకరణ

3. ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబుగామి
జానుఁదెనుఁగు విశేషము ప్రసన్నతకు

—ద్వి

# 4

## యథావాక్కుల అన్నమయ్య

యథావాక్కుల అన్నమయ్య క్రీ.శ. 1242 సంవత్సరంలో 'సర్వేశ్వర శతకము'ను రచించాడు. వీరశైవుడైన ఈ కవి అమోఘ కవితాధారాసంపద్విరాజితుడు. ఈతని కవిత్వం భక్తజనరంజకంగా భవబంధభంజకంగా తత్త్వప్రకాశకంగా చిత్రార్థబంధురంగా శ్రోత్రానందకరంగా నిర్దుష్టంగా ఉంది.

1. జగతీచక్రము పాదమట్టన నదృశ్యంబై ప్రవర్తింపఁగా
గగనంబంతయు బాహుమండల సమగ్రవ్యాప్తులం దద్భుతం
బుగ ఘూర్ణిల్ల నజాంత్యవేళల సముద్భూతాంగహారావళుల్
నిగుడంబొంగి నటింతు తాండవ మహానృత్యంబు సర్వేశ్వరా.

—18

2. అవనింబెన్నిధి భాగ్యహీనునకుఁ బ్రత్యక్షంబుగా కప్పు డొం
డవ భాండాకృతి దాల్చి మాఁటువడి మాయావృత్తి నున్నట్లుదా
భవదీయ ప్రతిబింబమూర్తియగు సద్భక్తుండు సంసార దు
ర్వ్యవసాయాత్ములకెల్లఁ గేవల నరుండై తోఁచు సర్వేశ్వరా.

—41

3. సత్యంబెప్పుడుఁ దప్పఁడేనియు దురాచారుండు గాఁడేని యౌ
చిత్యంబేమఱఁడేని దుర్జనుల గోష్ఠిం బొందఁడే భక్త సాం
గత్యం బాదటఁ బాయఁడేని మదనగ్రస్తుండు గాఁడేని నీ
భృత్యుండాతఁడు మూఁడు లోకములలోఁ బెంపొందు సర్వేశ్వరా.

—55

4. తరులం బువ్వులు పిందెలై యొదవి తత్తజ్జాతితోఁ బండ్లగున్
హర ! మీ పాదపయోజ పూజితములై యత్యద్భుతం బవ్విరుల్
కరులౌ నశ్వములౌ ననర్ఘమణులౌఁ గర్పూరమౌ హారమౌఁ
దరుణీ రత్నములౌ బటీరతరులౌఁ దథ్యంబు సర్వేశ్వరా.

—87

5. ఒక పుష్పంబు భవత్పదద్వయముపై నొప్పంగ సద్భక్తి రం
జకుఁడై పెట్టిన పుణ్యమూర్తికిఁ బునర్జన్మంబు లేదన్న బా
యక కాలత్రితయోపచారముల నిన్నర్చించుచున్ బెద్ద నై
ష్ఠికుఁడై యుండెడివాఁడు నీవగుటదాఁ జిత్రంబె సర్వేశ్వరా.

—88

# 5

# తిక్కన సోమయాజి

ఎఱ్ఱనచేత 'కవిబ్రహ్మ'గా ప్రశంసించబడ్డ తిక్కన సోమయాజి మనుమసిద్ధి ఆస్థానంలో 13వ శతాబ్దంలో ఉండేవాడు. ఇతడు కవిత్రయంలో రెండోవాడు. ఈయనకు 'ఉభయకవిమిత్రుఁడు' అనే బిరుదు ఉంది. అల్పాక్షరాల్లో అనల్పార్థాల్ని సృష్టించగల దిట్ట. నాటకీయతకు తిక్కన రచన పెట్టింది పేరు. ఇతడు భారతంలోని విరాటపర్వం మొదలు మిగిలిన పదిహేను పర్వాల్ని, నిర్వచనోత్తరరామాయణాన్ని రచించాడు.

1. ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియముదన మనంబున కగుఁదా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మ పథములకెల్లన్.

—భార. 12-5-220

2. పగ యడఁగించు టెంతయు శుభంబదిలెస్స యడంగునే పగం
బగ వగగొన్న మార్కొనక పల్కక యుండఁగ వచ్చునే కడుం
దెగ మొదలెత్తి పోవఁ బగదీర్పఁగ వచ్చినఁ గ్రౌర్య మొందు నే
మిగతిఁదలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా!

—పైది. 2-1-18

3. కనుఁగొని కోపవేగమునఁ గన్నులు నిప్పులు రాల నంగ ము
ల్గనలఁగ సాంద్రఘర్మ సలిలంబులు గ్రమ్మ నితాంత దంత పీ
డన రట దాన్యరంగ వికటభ్రుకుటీ చటుల ప్రవృత్త న
ర్తన ఘటనా ప్రకార భయద స్ఫురణా పరిణద్ధమూర్తియై.

—పైది. 4-2-133

4. సారపు ధర్మమున్ విమల సత్యము పాపముచేత బొంకుచేఁ
బారము పొందలేక చెడఁబాఱినదైన యవస్థ దక్షు లె
వ్వార లుపేక్ష సేసిరది వారలచేటగుఁ గాని ధర్మ ని
స్తారకమయ్యు సత్య శుభదాయకమయ్యును దైవ ముండెడున్.

—పైది. 5-3-273

5. కుచముల్ వాతెడి నీటిమీఁద విలసత్కోకంబులంగ్రేణి నే
యుచు నుండన్ మెడయెత్తి పాదయుగళం బూఁదంగ బాహాలతల్
పచరింపఁ గరమూల కాంతినిగుడన్ భావంబు రంజిల్లఁ బా
డుచుఁ గ్రీడించిరి పువ్వుబోఁడులు లతాడోలా కళా ప్రౌఢులన్.

—నిర్వ. 8-37

# 6

# మూలఘటిక కేతన

క్రీ.శ. 13 వ శతాబ్దికి చెందిన కేతన 'దశకుమార చరితము'ను రచించి తిక్కన సోమయాజికి అంకిత మిచ్చాడు. ఇతడు 'ఆంధ్రభాషాభూషణము' అనే ప్రప్రథమాంధ్ర వ్యాకరణాన్ని తెలుగులో రాసి వాసికన్నాడు. ఈయన 'విజ్ఞానేశ్వరము'ను కూడా రచించాడు. ఈ కవికి 'అభినవదండి' అనే బిరుదు ఉంది. కేతన కవిత్వం చెప్పి ఉభయ కవిమిత్రుణ్ణి మెప్పించిన ప్రోఢ.

1. కులశైలంబులు దిర్దిరందిరుగ దిక్కుంభీంద్ర వర్గంబు సం
చలతంజెంద వియత్తలంబు పగులన్ సర్వంసహాచక్ర మా
కులతం బొందఁగ సప్తసాగరములున్ ఘూర్ణిల్ల లోకంబు ల
ల్లలనాదం జెలఁగెన్ బ్రయాణపటహం బత్యద్భుతాపాదియై.

—దశ. 2-6

2. సమదృష్టిన్ ననుఁజూచి యచ్చెలువయున్ శారీరకంబైన కం
పముచే మానసవృత్తి యంతయును విస్పష్టంబుగా భావ సం
గము నాచిత్తము చూఱఁ గొలుకొనరాగ వ్యక్తి పుట్టించెనా
సుమనోబాణుఁడు వేయఁజొచ్చెఁ జెలువంజూతాంకు రాస్త్రమ్ములన్.

—పైది. 3-63

3. వారిజ బాంధవుఁడను సం
గారంబ పరాబ్ధిఁబడిన గ్రక్కున నెగసెన్
సూరెల ధూమంబనఁగన
వారితమై కవిసెఁజీకువా లెల్లడలన్.

—పైది. 7-90

4. నగుబాటో యెఱుఁగంద దాకృతి నమానంబేను జిత్రించితిన్
మగలీచందము వారలుంగల రొకోమర్త్యంబులో నింత పా
ల్పగు రూపంబున వాఁడు కల్గియొక కన్యం జూచి యుల్లంబునం
దగులం బొందిన యట్టి భాగ్యవతి చిత్తంబెంత రంజిల్లునో.

—పైది. 9-56

5. గుణదోషంబు లెఱిఁగి యిది
గుణ మిది దోషమని పూజగొందురు సుకవుల్
గుణదోషము లెఱుఁగక దు
ర్గుణములె గుణములని పూజగొందురు కుకవుల్.

—ఆంధ్రభాషా. 10

# 7

## మారన

తిక్కన సోమయాజి శిష్యుడైన మారన క్రీ.శ. 13 వ శతాబ్దికి చెందినవాడు. ద్వితీయ ప్రతాపరుద్రుని కరుణాకటాక్షాలకు పాత్రుడైన గన్నయకు అంకితంగా 'మార్కండేయ పురాణము'ను రచించటంచేత 14 వ శతాబ్దినికూడా మారన జీవించి ఉన్నట్లుగా మనం భావించవచ్చు. ఈయన కవిత్వం అల్లసాని పెద్దనాదులకు మార్గదర్శకమైంది.

1. అరయన్వర్ణము వేఱు రూపమును లేకత్యంత తేజోమయ
స్ఫురణాసంపదఁజెంది సర్వగతి సంపూర్ణత్వముం బొంది వీ
తరజస్సత్త్వ తమోవికార విమలత్వంబొంది యోగీంద్ర భా
సుర నిష్ఠాత్మకమాది మూర్తిగడుఁబొల్చున్ వాసుదేవాఖ్యమై.

—మార్కం· 1-112

2. ఆ నగుమోము చెన్ను శశియందును బంకరుహంబునందు లే
దానయన ప్రభాతిమద నాస్త్రములందు మెఱుంగులందు లే
దానును మేనికాంతిలతికావలియందుఁ బసిండియందు లే
దానలినాయతాక్షలలితాకృతి నామదిఁబాయ నేర్చునే.

—పైది. 2-161

3. ఏణీలోచనఁ బూర్ణచంద్ర వదనన్ హేమప్రభాంగిన్ ఘన
శ్రోణీమండలఁబీన బంధురకుచన్ రోలంబపుంజోల్ల స
ద్వేణింబల్లవ కోమలాంఘ్రి యుగళన్ దివ్యాంగనన్ లోక క
ల్యాణింగైకొని యప్పయోరుహవనంబయ్యోగి లీలాగతిన్.

—పైది. 2-205

4. తన పౌరుషంబు వదలక
మనుజుఁడు కార్యంబొనర్పమానుగ దైవం
బున యందుఁ బౌరుషమునం
దును దత్ఫలసిద్ధి దోఁచుఁదుల్యస్థితితోన్.

—పైది. 3-48

5. ఈ సుకుమారుదెవ్వఁడొకొ యిందుల కెందులనుండి వచ్చెనో
భాసుర రూపకాంతిజిత భావజచంద్రుఁడితండు రాగ లీ
లా సరసత్వ మొప్పఁ గడు లాలసుఁడైనముఁ జూచెనేని నేఁ
జేసిన పుణ్య మెవ్వరును జేయరుకాముని దక్క నేలుదున్.

—పైది. 4-230

# 8

## ఎఱ్ఱాప్రెగడ

'ప్రబంధపరమేశ్వరుఁడు,' 'శంభుదాసుఁడు' అనే బిరుదుల్ని పొందిన ఎఱ్ఱాప్రెగడ క్రీ.శ. 1280 ప్రాంతంలో జన్మించి, క్రీ.శ. 1345 వరకు జీవించి ఉంటాడని విమర్శకుల అభిప్రాయం. ఇతను 'నృసింహ పురాణము,' 'అరణ్యపర్వశేషము,' 'రామాయణము,' 'హరివంశము' అనే గ్రంథాల్ని రచించాడు.

1. దానాంభః పటలంబునం బృథుపయోధారావలిం జాల్చి గ
ర్జా నిర్ఘోషము బృంహితచ్ఛలనఁ బ్రచ్ఛాదించి ప్రావృట్ప్రయో
దానీకంబు శరద్భయంబున నిగూఢాకారతన్ డిగ్గె నాఁ
గా నొప్పారె మదోత్కట ద్విరదసంఘంబుల్ వనాంతంబునన్.

—భార. 3-4-143

2. అరదము దేహమింద్రియము లశ్వములాత్ముఁడు సూతుఁడమ్మహా
తురగ చయంబు ధైర్యమను తోరపుఁ బగ్గములన్ దృఢంబుగా
నురవడిబోకయుండ వెరవొప్పఁగఁ బట్టినవాఁడు నేమపుం
దెరువుననేఁగు నప్పరమధీరుడు సువ్వె యుదారుఁ డెయ్యెడన్.

—పైది. 3-3-92

3. శరణంబని వచ్చిన భీ
కర శత్రువు నయినఁ బ్రీతిఁ గావఁగ వలయుం
గరుణాపరుల తెఱంగిది
యిరవుగ సరిగావు దీనికే ధర్మంబుల్.

—పైది. 3-5-143

4. మనసిజ మంత్రఘోషములు మన్మథునానతి మాట లిందిరా
తనయ విలాసహాసములు దర్పకునార్పుటెలుగులంగజ
న్మని చదువుల్ మనోభవుని మోహన గీతుల నంగఁజూరు ఖే
లనములు నెల్ల దిక్కులఁ జెలంగె మదోత్కట కోకిల ధ్వనుల్.

—నృసిం. 2-73

5. ఘన రసోపయోగంబునఁ గ్రమ్ముఱంగఁ
బడసెఁ బ్రాయంబు దగదె యబ్బంగి యనఁగ
హరిత తృణలతారుణ కోమలాంగి యగుచు
బృథ్వి యెంతయుఁ గ్రొత్త యొప్పిదము నొందె.

—హరి.పూ. 6-111

# 9

## నాచన సోమన

క్రీ.శ. 1344 సంవత్సర ప్రాంతంవాడైన ఈ కవి 'ఉత్తర హరివంశము,' 'వసంత విలాసము' అనే రెండు గ్రంథాల్ని రచించాడు. ఈయనకు సకల భాషాభూషణ, సాహిత్య రసపోషణ, సంవిధాన చక్రవర్తి, నవీన గుణసనాథ అనే బిరుదులు ఉన్నాయి. పరవస్తు చిన్నయసూరి అలికంబున యక్షిని డాచినట్టి సర్వజ్ఞుఁడని ఈకవిని ప్రస్తుతించాడు.

1. అరిఁజూచున్ హరిఁజూచుఁ జూచుకములందందంద మందార కే
సరమాలా మకరందబిందు సలిల స్యందంబు లందంబులై
తొరఁగం బయ్యెద కొంగొకింత దొలగందోడ్తే శరాసారమున్
దరహాసామృతపూరముం గురియుచుందన్వంగి కేళీగతిన్.

—ఉ.హరి 1-162

2. ఓ నారాయణ ! యో మురాసుర హరా ! యో భక్త చింతామణీ !
యో నీలాంబుదవర్ణ ! యో గుణనిధీ ! యో లోకరక్షామణీ !
యో నీరేరుహపత్ర నేత్ర కృప నా యుల్లంబులో నుండవే
యో నావేభవబంధముల్ చెఱుపవే యో దేవకీనందనా !

—పైది. 2-129

3. న్యాయము దప్పకుఁడీ పురు
షాయుష జీవికయు లౌకికాచారము ని
శ్శ్రేయస సిద్ధియుఁ జెడు యతి
నాయక దూషణము చేసినన్ మనుజులకున్.

—పైది. 4-52

4. ఒక రామతిలకంబు రత్నరుచితో నొప్పారు మందార కో
రకముంగర్ణ వతంసతన్నిలుపుచున్ రాగాలతాసక్త చూ
చుక చేలాంచలయై మలంగివిడు మంచున్ గేలు సాచెన్ నసా
యక మౌర్విన్ దెగఁగొన్న మన్మథుని ప్రత్యాలీఢ పాదంబునన్.

—పైది. 2-51

5. పడగలు వేయిచేసి బలభద్రునికిన్ హరిపాపలాగు తో
నొడలును వేయిరూపముల నొప్పఁగ నప్పుడు వైనతేయు పై
విడిసిన వేయిశృంగముల వెండినగంబును నంజనాద్రియుం
దడబడఁ జేసి రిద్దఱునుదంచిత భానుయుగంబు చాడ్పునన్.

—పైది. 6-26

# 10

## మల్లికార్జునభట్టు

ఈ కవి 14 వ శతాబ్దికి చెందినవాడు. ఈతడు భాస్కర రామాయణంలో బాల, కిష్కింధ, సుందరకాండల్ని రచించాడు. ఈతని కవిత్వం సంస్కృతపదభూయిష్ఠమైనా సరళంగానూ సరసం గానూ ఉంటుంది.

1. జనలోకైక మహారథుండు ద్విజరక్షాదక్షుఁడాజింద్రిలో
చనుఁడుద్యచ్చతురంగ సైన్యుఁడును భాస్వద్రూపపంచాస్త్రుఁడ
న్యనృపక్రౌంచషడాననుండు ఘన సప్తాశ్వాన్వయుండష్ట మం
త్రినవద్రవ్యనిధీశుఁడై దశరథాధీశుండు పెంపొందఁగన్.

—బాల. 44

2. ధృతశక్రాయుధ మింద్రగోపయుత మార్ద్రీభూత భూభాగ మూ
ర్జితవాః పూర్ణసర స్తటాకతటినీ శ్రేణీకమానంద న
ర్తితకేకి ప్రకరంబలక్షిత దిశాదిత్యంబు నీలాంబు దా
వృత శైలౌఘము చాతకోత్సవము ప్రావృట్కాలమే పారఁగన్.

—కిష్కిం. 383

3. యమునద్గంగము కృష్ణభూమదిల మబ్జాక్షన్మనుష్యంబు నీ
ల మహీధ్రన్నిఖిలా చలావలితమాలద్భూజ మిందీవర
త్కుముదశ్రేణి పికద్విహంగము దమస్తోమద్గృహర్క ప్రభా
సముదాయంబగుచుండె లోకమలఘుశ్యామాభ్రముల్ పర్వినన్.

—పైది. 384

4. పరిచిత చక్రవాక కుచభారము నుత్పల దృష్టులున్ దళ
త్సర సిరుహాస్యముంబులిన చారునితంబముఁ జూచి వార్ధి ని
ర్జరనది గౌఁగిటం బొదువ జాచినచేతులనంగ నూర్ములం
బరతలమప్పళింపఁగని పావని చిత్తములోన నిట్లనున్.

—సుందరకాం. 14

5. పదములు పట్టుచుందొడలు ప్రాఁకుచునేచికుచంబు లంటుచుం
బెదవులు చీకుచుంగరము పేర్చికచగ్రహణంబు చేయుచున్
నుదతులయందు రాగములు సూపుచు బావకుఁడొప్పె నెంతయున్
మదన సుఖోచిత క్రియలు మక్కువఁ జల్పెడు కామికైవడిన్.

—పైది. 489

# 11

## రావిపాటి త్రిపురాంతక కవి

క్రీ.శ. 14 వ శతాబ్దికి చెందిన రావిపాటి త్రిపురాంతకుడు 'త్రిపురాంతకోదాహరణము,' 'అంబికాశతకము,' 'చంద్రతారావళి,' 'మదనవిజయము' అనే గ్రంథాల్నీ మరికొన్ని చాటుపద్యాల్నీ రచించాడు. ఉదాహరణ వాఙ్మయకారుల్లో ఈ కవి సుప్రసిద్ధుడు. ఈతని దేశికవిత మృదుమధురం.

1. ఆదిమ శక్తియాతరుణి, యాద్యకుటుంబిని యా కుమారి, ము
త్తైదువ యాతలోదరి, చిదాత్మక యాసతి, విశ్వమాత యా
పైదలి, సర్వలోక గురుభామిని యా చపలాక్షియంచు బ్ర
హ్మాదులు వచ్చి నిచ్చలు హిమాద్రిని నిన్నెఱిఁగింతు రంబికా.

—అంబికాశ.

2. పంచమివిభక్తి : కళిక – జయభద్ర రగడ
మఱియు సకలాశ్రితులమనుచు నర్థము వలన
వఱలు పరమానంద వనధి తీర్థము వలన
కొమరు మిగిలిన మంచుఁగొండ యల్లుని వలన
విమతపురదహనకర విష్ణుభల్లుని వలన
శివభక్త హృదయసంచిత నిధానము వలన
వివిధ రూపములతో వెలయు జ్ఞానము వలన
అజ్ఞాన ఘనతమంబడఁచు దీపము వలన
సుజ్ఞానులకుఁ బొడసూపు రూపము వలన
ఉత్కళిక.
తన కినుకలోఁ బుట్టి
కనలిదక్షునిఁ గొట్టి
యడరి వేల్పులఁ బఱచి
తొఢరి జన్నము చెఱచి
వీరభద్రుడు వచ్చి
చేరి మ్రొక్కిన మెచ్చి
యలరు నిత్యుని వలన
దళితదైత్యుని వలన.

—త్రిపురాం

# 12

## శ్రీనాథ మహాకవి

క్రీ.శ. 1360–1445 మధ్యకాలంలో ఈమహాకవి జీవించి ఉన్నట్లుగా విమర్శకుల అభిప్రాయం. ఈ కవి 'శృంగారనైషధము,' 'హరవిలాసము,' 'భీమఖండము,' 'శ్రీకాశీఖండము,' 'శివరాత్రి మాహాత్మ్యము,' 'పల్నాటివీరచరిత్ర' అనే గ్రంథాల్ని రచించాడు. ఈతని అలభ్యగ్రంథాలు 'మరుత్త రాట్చరిత్ర,' 'శాలివాహనసప్తశతి,' 'నందనందన చరిత్ర,' 'ధనంజయ విజయము,' 'వల్లభాభ్యుదయము.' ఈతడు కవిసార్వభౌమ బిరుదవిరాజితుడు, ప్రథమ కనకాభిషేక పరిగ్రహీత, బహుభాషా కోవిదుడు.

1. నలిన సంభవు సాహిణము వారువంబులు
        కులము సాములు మాకుఁగువలయాక్షి
చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు
        భోజనంబులు మాకుఁ బువ్వుఁబోణి
సత్యలోకము దాఁకసకల లోకంబులు
        నాటపట్టులు మాకు నబ్జవదన
మధురాక్షరములైన మా మాటలు వినంగ
        నమృతాంధసులె యోగ్యులనుపమాఁగి
భారతీదేవి ముంజేతి పలుకుఁజిలుక
సమదగజయాన సబ్రహ్మచారి మాకు
వేదశాస్త్ర పురాణాది విద్యలెల్లఁ
దరుణి నీయాన ఘంటాపథంబు మాకు.

—నైష. 2-49

2. సాక్షాత్కారముఁ జెంది నవ్వుచు గిరీశానుండు ధాత్రీధరా
ధ్యక్షాపత్యముఁ బ్రేమ నిర్భర కటాక్షాలోకన ప్రౌఢిమన్
వీక్షించెన్ దరళాక్షియున్ మనమునన్ వ్రీడాప్రమోదక్షమా
దాక్షిణ్యంబులు సందడింప నిలిచెన్ దత్సన్నిధానంబునన్.

—హరవి. 4-36

3. ఆహా! లెస్స! వివేకమే! పురహరుం డాసించియున్నాఁడె? నీ
స్వాహాకారము శంభుఁ బాసియిట నీ సత్రంబునందేను మృ
ష్టాహారంబు భుజింప వచ్చితినె? మోహాంధుండవై యీశ్వర
ద్రోహం బేటికిఁ జేసెదంచు హితబుద్ధుల్ సెప్పఁగా వచ్చితిన్.

—శ్రీకాశీ. 7-72

# 13

## వినుకొండ వల్లభరాయలు

క్రీ.శ. 15 వ శతాబ్ది పూర్వార్ధానికి చెందిన వినుకొండ వల్లభరాయడు 'క్రీడాభిరామము' అనే గ్రంథాన్ని రచించాడు. రావిపాటి త్రిపురాంతకుడు సంస్కృతంలో రచించిన అలభ్యమైన 'ప్రేమాభి రామా'న్ని అనుసరించి ఈ గ్రంథం రాయబడ్డట్లుగా తెలుస్తోంది. ప్రాచీనకాలంలోని అనేక సాంఘిక పరిస్థితులు ఈ గ్రంథాన్నిబట్టి కళ్ళకు కట్టినట్లుగా కన్పిస్తాయి. ఈతని కవిత్వాన్నిబట్టి కొందరు శ్రీనాథుడే ఈ గ్రంథాన్ని రచించాడన్నారు.

1. జనని సంస్కృతంబు సకల భాషలకును
దేశభాషలందుఁ దెనుఁగు లెస్స
జగతిఁ దల్లికంటె సౌభాగ్య సంపద
మెచ్చుటాడుబిడ్డ మేలు కాదె.

—క్రీడా. పుట 13

2. గార్గ్య సిద్ధాంత మతముపః కాలకలన
శకున మూనుట యది బృహస్పతి మతంబు
వ్యాస మతము మనః ప్రసాదాతిశయము
విప్రజనవాక్య మరయంగ విష్ణు మతము.

—పైది. 21

3. అవఅవమందు నెఱ్ఱని చంద్రమల్లెల
చోద్యంబు గుండాలు చొచ్చువారు
కరవాఁడి యలుఁగుల గనప పాతర్లలో
నుట్టిచేరులు గోసి యురుకువారు
గాలంపుఁ గొంకిఁ గంకాళ చర్మము గ్రుచ్చి
యుడు వీథినుయ్యాల లూఁగువారు
కటికి హెూన్నాళంబు గండకత్తెర వట్టి
మిసిమింతులును గాక మ్రింగువారు
సందులను నారసంబులు సలుపువారు
ఎడమ కుడి చేత నారతు లిచ్చువారు
సాహసము మూర్తి గైకొన్న సరణివారు
ధీర హృదయులు మైలారు వీరభటులు.

—పైది. 48

# 14

## జక్కన

విక్రమార్క చరిత్రను జక్కన క్రీ.శ. 1406 – 1422 మధ్యకాలంలో రచించి ఉంటాడు. 'విక్రమార్క చరిత్ర' తెలుగులో వెలసిన కథాకావ్యాల్లో మేలుబంతి. వర్ణనా విధానంలోనూ శైలీ విన్యాసంలోనూ ప్రబంధ కవులకు జక్కన మార్గదర్శకుడు. సాహస క్రియాకలిత వదాన్యతాది గుణగౌరవరేఖల నెక్కుడైన విక్రమార్క భూపతి చరిత్రను ప్రబంధశయ్యగా తీర్చిదిద్ది ఆంధ్ర సారస్వతంలో అజరామరమైన కీర్తినార్జించిన విద్వత్కవి జక్కన.

1. ఎత్తుల యొప్పకంటె నరమెత్తుట యొప్పుఁగఁ జొక్కి విల్వ కా
ఱొత్తడిఁ బుష్పముల్ కొనరకూరక యుక్కికి నల్లనవ్వుచున్
విత్తముతోన చిత్తములు వేగ హరింతురు నేర్పు మీఱఁగాఁ
జిత్తజు వేఁట దీమములు చెల్వునఁ దత్పురిఁ బుష్పలావికల్.

—విక్ర. 1-83

2. కల్పాంత దుర్దాంత కలుషాంతక స్వాంత
దుర్వార వహ్నికి నోర్వవచ్చు
నిష్ఠుర నిర్ఘోష నిర్ఘాత సంఘాత
జాత మహా మహావహ్ని సైఁపవచ్చుఁ
బ్రళయ కాలాభీల ఫాలలోచన ఫాల
భాగానల స్ఫూర్తి బ్రతుకవచ్చుఁ
గాకోదరేంద్ర ఫూత్కార సంభవ తీవ్ర
కాకోల దహనంబుఁ గదియవచ్చుఁ
గాక సైరింపవచ్చునే లోక దహన
దర్పితంబైన యస్మత్ప్రతాపవహ్నిఁ
దావకోత్సాహ సాహసౌదార్య ధైర్య
గతికి మెచ్చితి విక్రమార్క క్షితీంద్ర.

—పైది. 2-112

3. తుమ్మిలాకొమ్మ నెమ్మోము తమ్ములనఁగ
బింబహాయింతి కెమ్మోవి బింబమనఁగ
జాతియానాతి లేనవ్వు జాతి యనఁగ
రామ యొప్పారు లోకాభిరామ యగుచు.

—విక్ర. 4-18

# అనంతామాత్యకవి

అనంతామాత్యుడు క్రీ. శ. 1430 ప్రాంతంలో 'భోజరాజీయము' అనే కథాకావ్యాన్ని రచించాడు. ఇతడు 'ఛందోదర్పణము,' 'రసాభరణము' అనే లక్షణగ్రంథాల్ని కూడా రచించాడు. ఈ కవి కథనాత్మకశైలి కమనీయంగా ఉంటుంది.

1. యాగంబులనగు ఫలమును
యోగంబులవలన నగునమున్నతియును నా
నాగమ విహితార్చలనగు
బోగము శ్రీరంగ సేవఁబొలుపుగ నెగడున్.

—భోజ. 1-171

2. గురునకు సేవచేయుట తగుందగు విద్య పరిగ్రహింపఁగా
నరుదుగ నర్థమిచ్చిపడయందగు నొండెనువిద్యయిచ్చి వి
స్తరముగ విద్యగైకొనుట దానొక పక్షము మూఁడు రీతులం
బరఁగుట దక్క నాలవు నుపాయము లేదని చెప్పు శాస్త్రముల్.

—పైది. 2-147

3. ఆలోలాక్షి లలాట వక్త్రసదృశత్వాకాంక్షఁజంద్రుండు దా
బాలత్వంబు వహించి చూచియు నొగింప్రౌఢత్వముం బొందియున్
బోలం జాలక జాలిపొంది వగలం బొల్పేది లోఁగుందెఁగా
కాలోకింపఁ దదీయ బింబముకురంగాకారముం గూడునే.

—పైది. 3-157

4. బ్రాహ్మణులు గోవులతివలర్భకులు వీర
లేమి తప్పొనరించిన భూమియందు
శాస్త్రమతమునఁ దగిన శిక్షయ యొనర్పు
టుచితముగుఁగాని చంపఁగాదుగ్ర గతిని.

—పైది. 5-103

5. ఏదనుఁ బాసిపోవు తెఱఁగెద్దియుఁగానఁడు వీఁడు నెమ్మదిం
దాఁదిరుగందొడంగెఁ బులిదద్దయు నాఁకొనియోర్వలేక నా
మీఁదన సత్యదోషమిడి మిన్నక పోవునొయింక నాకు ని
చ్చోఁదడయంగరాదనుచు నూనునిడగ్గఱి ధేనువిట్లనున్.

—పైది. 6-28

# 16

## పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి

క్రీ.శ. 15వ శతాబ్దికి చెందిన ఈ కవి 'జైమిని భారతము,' 'శకుంతలా పరిణయము,' 'శృంగార శాకుంతలము' అనే గ్రంథాల్ని రచించాడు. ఈతడు రచించిన అలభ్యాలైన రచనలు: 'నవరసదర్పణము,' 'నారదీయము,' 'మాఘమాహాత్మ్యము,' 'మానసోల్లాసము'. శారదా పీఠాధిపతియైన ఈ కవి సరసకవిగా ప్రసిద్ధ.

1. జూదరి దుష్టదుర్వ్యసనుఁజోరుని సజ్జనదూషకున్ మృషా
వాదిఁగృపావిహీను గృహవిప్రవిఘాతకు లోభిసంతత
స్వోదర పూరకున్ బిశును నుద్ధతినింజెడఁ బాయులక్ష్మి వే
దాది సమస్త విద్యలు పరాన్నపరాయణుఁ బాయుకైవడిన్.

—జై.భా. 3-41

2. సంకటవంశదంశకటు ఝుంకృతులున్ నిబిరీసఝిల్లికా
ఝంకృతులుం బ్రచండమద సింధుర ఘీంకృతులున్ మృగద్విష
ద్ధ్వాంకృతులున్ జనశ్రుతిపదంబులు వ్రక్కలు సేయ వెల్లితా
తంక నివేశదీనలపితంబుల లక్ష్మణుతోడనిట్లనున్.

— పైది. 6-62

3. వాలికలై విరిదమ్ముల
యేలికలై భావభవుని యెలదూపులకుం
బోలికలై యుత్కలికల
మూలికలై యబలఁదాఁకె మెఁగి నృపుచూపుల్.

—శకుం. 2-87

4. ఆదిఁజంద్రుఁడు చంద్రికారుచులనయ్యబ్జాస్యఁ గల్పించెనో
లేదేఁగంతుఁడు చెల్వముల్ వెరఁజియాలీలావతిం జేసెనో
కాదేఁజైత్రుఁడు తావుల్లెల్లఁగొని యాకాంతన్విర్మించెనో
వేదాభ్యాసజడుండజుండెటులఁ గావించుందనీయాకృతిన్.

—పైది. 2-186

5 కుముదోజ్జీవన మంత్రమంగజభుజాకోదండ గర్వంబు సం
తమ సానేక కూటపాకలము జ్యోత్స్నావర్షి వర్షాపయో
దము పాంథవ్రజ చిత్తశల్యము నిశాధమ్మిల్ల బంధూకగు
చ్ఛము ప్రాచీనగశృంగవీథిఁ బొడిచెంజంద్రుండు సాంద్రద్యుతిన్.

—పైది. 3-154

# 17

## బమ్మెర పోతన

బమ్మెర పోతన క్రీ.శ. 15వ శతాబ్దికి చెందినవాడు. ఇతడు 'భోగినీదండకము,' 'నారాయణ శతకము,' 'వీరభద్రవిజయము,' 'శ్రీ మహాభాగవతము' అనే గ్రంథాల్ని రచించాడు. ఈ కవి సహజపాండిత్య శోభితుడు, అనుప్రాసాలంకార ప్రియుడు. ఈయన శ్రీ మహాభాగవతానువాద పద్ధతి సరళం సుబోధకం మరియు వివరణలతో కూడుకొన్నది.

1. లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతాశోభితమున్ సువర్ణ సుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వలవృత్తంబు మహా ఫలంబు విమలవ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరువుర్విన్ సద్ద్విజశ్రేయమై.

—శ్రీ మహాభాగ. 1-19

2. అచ్చపుఁ జీకటింబడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁబుట్టుచున్ మఱలఁ జర్వితచర్వణులైన వారికిం
జెచ్చెరఁబుట్టునే? పరులు సెప్పిన నైననిజేచ్ఛనైననే
మిచ్చిననైనఁగానలకు నేఁగిననైన హరి ప్రబోధముల్.

—పైది. 7-181

3. లీలన్ రామవిభుండొక
కోలన్గూలంగనేసెగురునయశాలిన్
శీలిన్ సేవిత శూలిన్
మాలిన్ వాలిందశాస్యమానోన్మాలిన్.

—పైది. 9-272

4. ధన్యున్ లోకమనోభిరాముఁగుల విద్యారూపతారుణ్య సౌ
జన్య శ్రీ బలదానశౌర్యకరుణా సంశోభితున్ నిన్ను నే
కన్యల్ గోరరు? కోరదేమునురమాకాంతాలలామంబు రా
జన్యానేకపసింహ! నా వలననే జన్మించెనే మోహముల్.

—పైది. 10-1702

5. మేరువు వింటికమ్మియట మేదిని తేరట సూర్యచంద్రులిం
పారఁగ బండికండ్లటననంతుఁడు నారట బ్రహ్మవిష్ణువుల్
సారథియున్ శరంబులట సామచయంబట గుఱ్ఱముల్ మనో
జారికి నెవ్వరీడు త్రిపురాసుర వైరికి నన్యదైవముల్.

—వీరభద్ర. 4-34

# గౌరన

క్రీ.శ. 15వ శతాబ్దిపూర్వార్ధానికి చెందిన గౌరన 'హరిశ్చంద్రోపాఖ్యానము,' 'నవనాథ చరిత్ర' అనే గ్రంథాల్ని రచించాడు, ద్విపదరచనచేసి తెలుగు కవుల్లో ప్రసిద్ధినొందిన వారిలో ఇతనొకడు. ఈతని కవిత్వం సహృదయుల ఆమోదాన్ని పొందింది.

1. తపుల ప్రాయపుమందు తావులపొందు
విరహులమంట కోవిలగమిపంట
రతిసుఖంబుల చొక్కు రసికుల మ్రొక్కు
రతిరాజు జోకవిరక్తుల డాక
పువ్వుబోణులయుబ్బు పుష్పాస్త్రుగబ్బు
పువ్వుఁదేనెల ఫెచ్చు భోగులమెచ్చు
వెలయవసంత మవ్వేళనెల్లెడలఁ
గలయుంగ......

—నవనా. 1

2. అల రెండువేల జిహ్వలవానికైనఁ
గొలఁదె హరిశ్చంద్ర గుణములు వొగడఁ
దనువెల్ల సత్యంబు తలఁపెల్లఁగరుణ
పనులెల్ల ధర్మంబు పలుకెల్లఁబ్రియము
బొంకునాలుకకుఁజేర్పుటకాని వావి
యింకనిన్నియుఁజెప్పనేమి కారణము
వారిజగర్భుని వ్రాఁతదప్పినను
వారిజాప్తుఁడు దూర్పు వంకఁగ్రుంగినను
మేరువు గ్రుంగిన మిన్ను వ్రాలినను
ధారుణీచక్రంబు తల్లక్రిందువడిన
వారిధులింకిన వజ్రాయుధంబు
ధారతప్పిన మాటతప్పఁడారాజు.

—హరిశ్చం. 1-231-242

# 19

# కొఱవి గోపరాజు

కొఱవి గోపరాజు క్రీ.శ. 15 వ శతాబ్దికి చెందినవాడు. ఈ కవి 'సింహాసనద్వాత్రింశిక' గ్రంథాన్ని రచించాడు. ఈ కవి సంస్కృతాంధ్ర పదాల్ని సమరీతిని మేళవించి రసనిర్భరంగా అనువదించాడు. కథాకావ్యాల్లో దీనికి విశిష్టస్థానం ఉంది.

1. ఈ సరసోక్తి కావ్యమొకఁడిమ్ముల సంస్కృతభాషనచ్చుగాఁ
జేసిన నట్లవీఁడు మఱిచేయుట యేటిదియంచుఁ జెప్పఁగాఁ
జేసియనాదరంబురక చేయకుఁడీవిలుకాఁడు తూఁటుగా
నేసిన నందెపాఱమఱియేసిన వానిద సూటిగావునన్.

—సింహా. 1-35

2. అలకలలిఁవ్రజంబు, వదనాబ్జము చంద్రుఁడు, సుస్వరంబు కో
కిలములు, మంజువాక్యములు కీరగణంబులసొంపు ; చల్ల నూ
ర్పులు మలయానిలంబయిన రూపము దాల్చి యనంగ సేననాఁ
జెలఁగెననంగసేనయను చేడియభర్తృహరీష్ట భార్యయై.

—పైది. 1-77

3. పెద్దయొసఁగెడు మాట యప్రియముకంటెఁ
బడుచుచే నీతివాక్యంబు పడయఁ జొప్పు
శాస్త్రవేది చేనున్న విషంబుకంటె
గొల్లవానిచే నమృతంబు గొనుటమేలు.

—పైది. 3-10

4. గద్యము బద్యముంబెనుపఁ గైకొనుటొండె, ధ్రువప్రబంధ సం
పద్యుతుఁడౌటయుండె, మృదుభాషలఁ బ్రొద్దులుపుచ్చుటొండె, లో
కోద్యమ లక్షణం బెఱుఁగుటొండె, కడున్భజియించుఁగాక యే
విద్యలు నేరఁడేనిఁ బృథివింబశువాతఁడెగా గణింపఁగన్.

—పైది. 4-171

5. మనుఁడౌ విష్ణుఁడు జన్నిదంబు శిఖియున్ గాయత్రి పల్కుల్ మృగా
జినముంగోఁచియుదర్భలు గొడుగు మౌంజీబంధము గోపిచం
దనము న్వేలిమిబొట్టుఁ గుండలములున్ దండంబునందంబుగా
నినువంచింపఁ గడంగి తాఁగుఱుచయై నీచేత వర్ధిల్లఁడే.

—పైది. 8-59

# 20

# వేమన

క్రీ.శ. 15 వ శతాబ్ది మొదలు క్రీ.శ. 18 వ శతాబ్దివరకు వేమనకాలాన్ని విమర్శకులు అనేక విధాలుగా ఊహించారు. ఈ కవి సూక్తుల్ని 'వేమన సూక్తిరత్నాకరము' అనే పేరుతో బందరులో ప్రకటించారు. రెడ్డి కులావతంసుడైన వేమన లోకానుభవాన్ని విశేషంగా కలవాడు. ఇతడు మొదట రాగియై తర్వాత విరాగి అయ్యాడని జనశ్రుతి. ఇతడనేక నీతుల్నీ ఆధ్యాత్మవిషయాల్నీ ప్రాయికంగా ఆటవెలదుల్లో తేటతెలుగుమాటల్లో రాసి విశిష్ట విఖ్యాతిని ఆర్జించుకొన్నాడు.

1. ఇచ్చువానిచెంత నీయనివాఁడున్న
చచ్చుఁగాని యీవిసాగనీఁడు
కల్పతరువుక్రింద గ్రచ్చచెట్టున్నట్లు
విశ్వదాభిరామ వినుర వేమ.

—వే.సూ. 347

2. ఎద్దుకైనఁగాని యేడాది తెల్పిన
మాటదెలిసి నడచు మర్మమెఱిఁగి
మొప్పె తెలియలేఁడు ముప్పదేండ్లకునైన
విశ్వదాభిరామ వినురవేమ.

—పైది. 356

3. తల్లిగర్భమందుఁ దాఁబుట్టినప్పుడు
మొదలు బట్టలేదు తుదనులేదు
నడుమబట్టగట్ట నగుఁబాటు గాదొకో
విశ్వదాభిరామ వినురవేమ.

—పైది. 1845

4. ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు
చూడఁజూడ రుచుల జాడవేఱు
పురుషులందుఁ బుణ్యపురుషులు వేఱయా
విశ్వదాభిరామ వినురవేమ.

—పైది. 534

5. చదువులందు పాఁడి మొదవులందును స్త్రీల
పెదవులందు రాజ్య పదవులందు
ఆశ లుడిగినట్టి యయ్యలు ముక్తులు
విశ్వదాభిరామ వినురవేమ.

—పైది. 1479

# అల్లసాని పెద్దన

అల్లసాని పెద్దన క్రీ.శ. 1509 నుంచి 1529 వరకు విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించిన శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవి. ఈయనకు 'ఆంధ్రకవితా పితామహుఁడు' అనే బిరుదు ఉంది. ఈ కవి శిఖామణి రచించిన 'మనుచరిత్రము' ప్రబంధాల్లో మొదటిది. పెద్దనగారు నవరసాల్ని సందర్భోచితంగా పరిపోషించారు.

1. ఆ పురిఁబాయకుండు మకరాంకశశాంక మనోజ్ఞమూర్తి భా
షా పరశేషభోగి వివిధాధ్వర నిర్మల ధర్మకర్మ దీ
క్షాపరతంత్రుఁడంబురుహ గర్భకులాభరణంబనారతా
ధ్యాపన తత్పరుండు ప్రవరాఖ్యుఁడ లేఖ్యతనూ విలాసుఁడై.

—మనుచ. 1-51

2. అటఁజని కాంచె భూమిసురుఁ డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్వన
స్ఫుటనటనానురూప పరిపుల్ల కలాపకలాపిజాలముం
గటక చరత్కరేణు కరకంపితసాలము శీతశైలమున్.

—పైది. 2-3

3. బహురత్నద్యుతి మేదురోదరదరీ భాగంబులంబొల్చు ని
మ్మహికాహార్యము నంజరింతు మెపుడుం బ్రేమన్ నభోవాహినీ
లహరీ శీతల గంధవాహ పరిఖేలన్మంజరీ సౌరభ
గ్రహణేందిందిర తుందిలంబులివి మత్కాంతారసంతానముల్.

—పైది. 2-45

4. ఎవ్వఁడు మీఁదెఱుంగక యథేచ్ఛ సుఖైకరతిం జరింపఁగా
నవ్వల వంశహాని వ్రతహాని యశోధనహాని పుట్టుఁదా
నవ్వెడఁగమ్మనుష్య పశువయ్యవివేకి చెడున్ జగంబునన్
నవ్వఁగఁబాలు రౌరవమునంబడఁబాలును నింద పాలునై.

—పైది. 3-135

5. శరసంధాన బలక్షమాది వివిధైశ్వర్యంబులంగల్గి దు
ర్భరషండత్వబిల ప్రవేశచలన బ్రహ్మఘ్నుతల్ మానినన్
నరసింహక్షితిమండలేశ్వరులనెన్నన్ వచ్చు నీసాటిగా
నరసింహక్షితిమండలేశ్వరునిఁ గృష్ణారాజకంఠీరవా.

—చాటువు

# 22

## శ్రీకృష్ణదేవరాయలు

శ్రీకృష్ణదేవరాయలు క్రీ.శ. 1520–21, మధ్యకాలంలో 'ఆముక్తమాల్యద,' ('విష్ణుచిత్తీయము')ను రచించాడు. ఇతడు 'జాంబవతీపరిణయ నాటకము,' 'మదాలస చరిత్ర,' 'రసమంజరి' మొదలైన గ్రంథాల్ని వెలయించాడు. ఈయన పరిపాలనాకాలంలో ఆంధ్రసారస్వతం అత్యంతం అభ్యుదయాన్ని పొందింది. ఈయనకు 'సాహితీసమరాంగణ చక్రవర్తి,' 'మూరురాయరగండఁడు,' 'యవనరాజ్య స్థాపనాచార్యుఁడు' మొదలైన బిరుదు లున్నాయి. ఈయన ఆస్థానంలో అష్టదిగ్గజాలని ప్రసిద్ధిపొందిన అల్లసాని పెద్దన, తిమ్మన, ధూర్జటి మొదలైన ఎనమండుగురు కవులుండేవారు. ఆముక్తమాల్యదలో రాయలవారి వర్ణనాచమత్కృతి, పాండితీగరిమ, మనోవిశ్లేషణ గోచరిస్తాయి.

1. సిరినొక్కప్పుడు కన్మొఱంగి హరిదక్షోరస్స్పృహర్షించును
ర్వరకున్వంచన గూడఁగాఁ గలుగు భాస్వచ్చంద్రశాలాపరం
పరలయ్యెన్బఱపైన యెవ్వని ఫణాపంక్తుల్భజింతున్నిరం
తరముందాంతుని నయ్యనంతుని నతీతబ్రహ్మకల్పాంతునిన్.

—ఆముక్త. 1–2

2. గురుగుంజెంచలిఁదుమ్మిలేఁదగిరి సాకుందింత్రిణీపల్లవో
త్కరముంగూడఁ బొరంటినూనియలతోఁ గట్టావికుట్టారుగో
గిరముల్ మెక్కి, తమింబసుల్ పాలమువోఁగ్రేఁపుల్ మెయిన్నాకమే
కెరువుంగుంపటి మంచమెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్.

—పైది. 4–134

3. చంపి ధార్మికుండు, నతిఁబొందిమఱిబ్రహ్మ
చారి, బొంకి సత్యశాలి, యార
గించి సదుపవాసి, కేడించి శూరుఁడు,
చిందిధనియు నగువిచిత్రసరణి.

—పైది. 4–278

4. నెలఁతఁగుచకుంభయుగళముండియు వియోగ
జలధి యీఁదింపలేదయ్యె; సఖులు వంచు
చున్న పన్నీటి వెల్లిలోఁగొన్న కతన
ముంపకది లాఘవమునఁదేలింపఁగలదె.

—పైది. 5–151

5. కాంచెన్వైష్ణవుఁడర్ధయోజన జటాఘాటోత్థశాఖోపశా
ఖాంచజ్ఝాట చరన్మరుద్రయదవీయః ప్రేషితోద్యచ్ఛదో
దంచత్కీటకృతవ్రణచ్ఛలన లిప్యాపాది దాధ్వన్యని
స్సంచారాత్తమహాఫలోపమఫల స్ఫాయద్వటక్ష్మాజమున్.

—పైది. 6–51

# ధూర్జటి

ధూర్జటి క్రీ.శ. 16వ శతాబ్ది పూర్వార్ధానికి చెందినవాడు. ఈతడు 'శ్రీకాళహస్తీశ్వర శతకము,' శ్రీకాళహస్తిమాహాత్మ్యము' అనే రెండు గ్రంథాల్ని రచించాడు. పరమేశ్వర పాదారవింద ధ్యానైకతత్పరుడైన ఈతని కవిత్వం మాధుర్యగుణ శోభితం.

1. ఏలీలన్నుతియింపవచ్చునుపమోత్ప్రేక్షాధ్వని వ్యంగ్య శ
బ్దాలంకారవిశేషభాషల కలభ్యంబైన నీరూపముం
జాలుంజాలుఁగవిత్వమున్నిలుచునే సత్యంబు వర్ణించుచో
ఛీలజ్జింపరుగాక మాదృశకవుల్ శ్రీకాళహస్తీశ్వరా !

—శ్రీకాళ. శత.

2. ఉదయగ్రావము పానవట్ట, మభిషేకోదప్రవాహంబు వా
ర్ధి, ధరధ్వాంతము ధూపధూమము, జ్వలద్దీపప్రభారాజి కౌ
ముది, తారానివహంబు లర్పితసుమంబుల్ గాఁ దమోదూర సౌ
ఖ్యదమై శీతగభస్తిబింబ శివలింగంబొప్పెఁబ్రాచీదిశన్.

—శ్రీకాళ. మా. 2-132

3. తమయిల్లాండ్ర మనోహరావయవ సౌందర్యంబుతో సామ్య వ
ర్గము పాటింపఁగనోకిరాతులు నిజాగారంబులంగట్టి సిం
హమయూరీహరిణేభశాబముల నాహా ! పెంతురాశంకఁద
ద్రమణీమధ్య కచేక్షణస్తవము లుత్పాదింపఁగాకుండునే ?

—పైది. 3-16

4. సంతోషంబునఁగాంచెఁదిన్నఁడు సమస్త వ్యాపకానంత వే
దాంత స్థాపితచిన్మయాంగమునవిద్యాధ్వాంతసంతాన సం
క్రాంతస్వాంత నిశాంతజంతు సుఖమార్గప్రాపకాభంగరు
క్కాంతాపాంగము దివ్యలింగము వివిక్తధ్యేయ నిర్లింగమున్.

—పైది. 3-63

5. అమృతముఁగ్రోలు జిహ్వచవియంచుఁదలంచునె తేనె? నింటిలో
నమరమహీరుహంబుదయమైన నరుండవనీశు వేఁడునే?
యమిజన భాగ్యరూపమగునాదిమతత్త్వముఁగాళహస్తి దై
వము భజియించు మానసము వారవధూమద సౌఖ్యమెంచునే ?

—పైది. 4-43

# నంది తిమ్మన

క్రీ.శ. 1520 ప్రాంతంలో నంది తిమ్మన 'పారిజాతాపహరణము' అనే ప్రబంధాన్ని రచించి శ్రీకృష్ణదేవరాయలకు అంకితమిచ్చాడు. ఈ కవి వర్ణనలు సంగ్రహంగా భావగర్భితంగా మనోహరంగా ఉంటాయి. ఆంధ్ర ప్రబంధవాఙ్మయంలో ఈ గ్రంథం మేల్బంతి.

1. పతిప్రాణ సదృశబంధువు
పతిదైవం బేసుగడయుఁ బతినతులకున
ప్పతియకడు మేరదప్పిన
గతికులకాంతలకు వేఱుగలదే చెపుమా.

—పారి. 1–96

2. జలజాతానన వాసవాది సురపూజాభాజనంబై తన
ర్చులతాంతాయుధుకన్న తండ్రిశిరమచ్చో వామపాదంబునం
దొలఁగంద్రోచెలతాంగి ; యట్లయగు ; నాథుల్నేరముల్ సేయఁబే
రలుకంజెందినయట్టి కాంతలుచితవ్యాపారముల్ నేర్తురే.

—పైది. 1–121

3. ననుభవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁబూని తాఁ
చినయది నాకు మన్ననయ, చెల్వగునీపదపల్లవంబు మ
త్తనుపులకాగ్ర కంటకవితానము దాఁకిన నొచ్చునంచునే
ననియెద ; నల్కమానవుగదాయిఁకనైన నరాళకుంతలా.

—పైది. 1–123

4. వలిపము గట్టి హారములువైచి పటీరము మైనలంది జా
దులు నెఱిగొప్పునందుఱిమిత్రోవనెపోయితిమేని తాఁకియుం
దలఁచెడువారు లేరని మనంబుకలంకలుదేర్చి జారకాం
తల సమయస్థలంబులకుఁదార్చిరి దూతికలట్టి వెన్నెలన్.

—పైది. 2–52

5. నిగమాంత ప్రతిపాద్యు నాద్యునభవున్నిత్యున్గుణా తీతువి
శ్వగురున్ జిన్మయునవ్యయుంబరము నిశ్శంకంబనుల్గొంచు మౌ
నిగరిష్ఠుండు కృతార్థుడయ్యెనననందేహింపఁగానేల భ
క్తగణాధీనుఁడనంగ నవ్విభుఁడు లోకఖ్యాతిఁబొందఁడే.

పైది. 5–87

# అయ్యలరాజు రామభద్రకవి

క్రీ.శ. 1495–1550 సంవత్సర కాలంలో పేర్గాంచిన ఈ కవి 'సకల కథాసార సంగ్రహము,' 'రామాభ్యుదయము' అనే గ్రంథాల్ని రచించాడు. రామాభ్యుదయ గ్రంథాన్ని అళియరామరాయల మేనల్లుడైన గొబ్బూరి నరసరాజుకు రామభద్రకవి అంకితమిచ్చాడు. రామభద్రకవి రామచరిత్రను రసవంతంగా రచించాడు.

1. స్ఫటికాక్షమాలికల్ చక్కనివివియంచు
హారలతాపంక్తులంటి చూచు
హృద్యముల్ చోద్యంబులీకమండలు లంచుఁ
దమిఁబయోధరములు నిమిరి చూచు
భసితాంగరాగ సంపద బాపురేయంచు
నొడలిగంధపుఁబూఁతఁ దడవి చూచు
నివియపూర్వంబులైనవి వల్కలములంచుఁ
బట్టుఁబుట్టంబులు ముట్టి చూచు
మణితముల్ విని యాశ్చర్య మగ్నబుద్ధిఁ
గాయసిద్ధి ప్రభావంబుఁగాంచు దివ్య
తాపసులు వీరు వీరి మంత్రములు నేర్వ
వలయునని చేరి ప్రార్థించి పలుకఁ జూచు.

—రామా. 2-121

2. ఆకరియాన వేనలియినంత విలాసము మాధవోదయం
బాకమలాయతాక్షి మధురాధరసీమ హరిప్రకారమా
కోకిలవాణి మధ్యమునఁగూడిన దింతియకాదు తాను రా
మాకృతిదాల్చె నీ చెలువమంతయు నాయమయందుఁ జొప్పడున్.

—పైది. 4-68

3. శరకాండ జడిమదక్కన్
శరకాండ మఖండ కాంతి సంపద నింకన్
శరదాగమంబు వోవన్
శరదాగమమిపుడు మించె జనరంజనమై.

— పైది. 6-36

4. దారుణ కంఠపాశమగు దానవకోటికిఁ బంక్తికంఠ కం
ఠీరవ పీఠికిన్ బ్రతిఘటించిన పీఠమగున్ గురుత్వ నం
హారకమైన చూఁడుఁగొడుపొ నిదిలంకకు బాపురే! యసా
ధారణ మేమనంగలము తావకవాలము వాయునందనా!

—పైది. 7-8

# చింతలపూడి యెల్లనార్యుడు

క్రీ శ. 16వ శతాబ్ది పూర్వార్ధానికి చెందిన ఈ కవి శ్రీకృష్ణదేవరాయలవారిచే సన్మానించబడ్డారు. ఇతడు 'శ్రీరాధామాధవము,' 'తారకబ్రహ్మరాజీయము,' 'విష్ణుమాయా నాటకము' అనే మూడు గ్రంథాల్ని రచించాడు. ఇతనికి రాధామాధవకవి అనే ప్రశస్తి ఉంది.

**1.** కలమృదువల్లకీరవముకంటె వసంతవిహార చారు కో
కిలనినదంబుకంటె నళికిర రుతంబులకంటెఁదాళ సం
కలిత మృదంగ శబ్దములకంటె మనోహర కామినీ వచః
కలనలకంటె నింపొసఁగుఁగా చెవికిన్ హరినామ వర్ణనల్.

—విష్ణు. 1-70

**2.** విష్ణుమాయగాఁగ వివరింపుదురు మహా
సూక్ష్మమతులు, మఱియు స్థూలమతులు
బ్రహ్మసృష్టిగాఁగ భావింత్రు, కొంద ఱె
ద్దియును నెఱుక పడక తిరుగుచుంద్రు.

—పైది. 3-74

**3.** అల్ప సంసార విషయ సుఖానుభోగ
మభిలషింపుదురధము లిట్లధమగతికిఁ
దద్విరక్తి ప్రబోధసుధా స్వరూప
చిదమలానంద మనుభవింపుదురు మునులు.

—పైది. 3-172

**4.** విలసద్గోపవధూచకోరములకున్ విందైముఖేందుద్యుతుల్
దిలకింపన్యమునాసరిత్పులిన ధాత్రీమండలిన్దీపికా
వళి శ్రీనిండఁద్రిభంగిమై మురళిరావ శ్రీలగోరాజి ని
చ్చలు మోదాంబుధిఁ దేల్చు నిన్గొలుతుఁ గృష్ణా! వల్లవీ వల్లభా.

—శ్రీరాధా. 2-26

**5.** చక్రవర్తియయ్యె జలజనేత్రుని నేత్ర
మతివజమున చక్ర మాక్రమించి
కొమ్మ మోవి తేనెఁగొని సుధాంధ శ్శ్రేష్ఠుఁ
డామహాత్ముఁడగుట యరుదెయింక.

—పైది. 4-307

# 27

## మాదయగారి మల్లన

క్రీ.శ. 16 వ శతాబ్ది పూర్వార్ధానికి చెందిన మాదయగారి మల్లన 'రాజశేఖర చరిత్రము' అనే మూడాశ్వాసాల ప్రబంధాన్ని రచించి శ్రీకృష్ణదేవరాయల మంత్రియైన తిమ్మరుసు అల్లుడైన నాదిండ్ల అప్పామాత్యునికి అంకితమిచ్చాడు. ఈతని కవిత్వం నిర్దుష్టంగా, ప్రౌఢభావబంధురంగా, రసవంతంగా ఉంది.

1. తల్లీ! శాంభవి! లోకపావని! సముద్యద్భక్తితో నెవ్వఁడేన్
హృల్లేఖన్ భవదీయమంత్ర కలనా హీనస్థితింగాంచు వా
నిల్లాలై విహరించుఁబంకజపుటీహేలాగతుల్మాని సం
పల్లీలావతి వానిభాగ్యము నిలింప స్వామికిం గల్గునే?

—రాజ. 2-90

2. తరుణ పవమానమదకే
సరిపోతము విటపికుంభసామజకుంభాం
తరములు గ్రొవ్వినఁ దొరఁగెడు
గురుమౌక్తిక భాతిరాలెఁ గ్రొవ్విరు లవిగో.

—పైది. 2-118

3. కులనిర్మూలన కారణంబు ప్రతిభాకుట్టాకముద్వేగ కో
పలతా దోహదమాజవంజవ సుఖప్రత్యూహమాత్మ వ్యథా
జ్వలన జ్వాలిక కామినీ నయన వీక్షాపాతసంరోధిని
త్యలఘుత్వాశ్రయ భూమి లేమియది యాహాయేమి గావింపదే.

—పైది. 3-14

4. వెడవెడ జారునీవి యరవీడిన పెన్నెఱిగొప్పు నెన్నడం
దడఁబడు పాదపద్మములు దారినకన్గవ చూపుతోరమై
బడిబడి వెళ్లునూర్పుగమి పయ్యెద యొయ్యన జాఱఁగా బయల్
పడుచను గుబ్బలుంగల విలాసిని చందముఁజూచి నెచ్చెలుల్.

—పైది. 3-82

5. రాహువుగాను నిన్నుఱంగ రాచిన శూరుఁడఁగాను సీతను
ద్రోహము చేసినట్టి యలరోహిణి తండ్రినిగాను దజ్జగ
న్మోహిని నీలనీలకచముద్దుల చక్కెరబొమ్మఁ గూర్పక
య్యోహరిణాంకతావక మయూఖ ముఖంబులనేఁచ నేటికిన్.

—పైది. 3-150

# 28

## ఎడపాటి ఎఱ్ఱన

ఎడపాటి ఎఱ్ఱన 16వ శతాబ్దపు పూర్వార్ధంలో రాయలకాలంలో ఉండేవాడు. ఇతడు 'శృంగారమల్లణచరిత్ర,' 'కుమారనైషధము' అనే గ్రంథాల్ని రచించాడు. ఈతడు తన శృంగారమల్లణచరిత్రను చుండికాశనమంత్రికి అంకితమిచ్చాడు. ఈ ప్రబంధం శివభక్తి ప్రధానంగా రచించబడింది. ఈ కవి సరస కవితాచతురుడు.

1. గములుగఁబద్మరాగములఁగ్రమమరీచులు చౌకళింపఁగాఁ
గమలవనంబులెన్నఁడు వికాసముఁగుందవు వజ్రమౌక్తికా
సమరుచి చంద్రికన్ గుముదషండములున్ గనుగందకుండు నాఁ
గొమరగు దివ్యరత్నమయగోపురవైభవమెన్న నేటికిన్.

—శృంగారమల్ల 1–35.

2. కలకంఠకంఠి! నీకన్నులు చాలవే
యవలీల భువనత్రయంబు గెలువ
పద్మాయతాక్షి! నీ పలుకులు చాలవే
సరసుల హృదయంబుఁ జల్లఁజేయ
కాంతాలలామ! నీ కన్నులు చాలవే
దేవేంద్రభోగంబు ధిక్కరింప
కిసలయపాణి! నీ కెమ్మోవి చాలదే
నయమునఁబ్రాణదానంబు సేయ
నాతి! నీ పొందు చాలదే నాకు నిపుడు
నంచితానంద సౌఖ్యంబు లందఁజేయ
నితరకృత్యంబు లెవ్వియు నేలనాకు
నిన్నుఁజూచుట చాలదేనెలఁతయనిన.

—పైది. 2–80.

3. పరిమళములలోఁగస్తురి,
తరువులలోఁజందనంబు, దైవంబులలోఁ
బరమేశుఁడు, విద్యలలో
నరయంగాఁ గవితయెక్కుడగుననిరార్యుల్.

—పైది. 3–147

# కందుకూరి రుద్రకవి

క్రీ.శ. 16వ శతాబ్దిపూర్వార్ధానికి చెందిన ఈ కవి 'నిరంకుశోపాఖ్యానము' అనే ప్రబంధాన్ని 'సుగ్రీవవిజయము' అనే యక్షగానాన్ని, 'స్మరదీపిక,' 'సరసజన మనోరంజనము,' 'రాష్ట్రోఢవంశ మహాకావ్యము,' 'బలవదరీశతకము,' 'గువ్వలచెన్నని శతకము, 'జనార్దనస్తోత్రాష్టకము,' 'జనార్దనాష్టకము' అనే గ్రంథాల్ని రచించాడు. ఈ కవి రచనాకౌశలం కల్పనాచమత్కృతి ప్రశంసనీయాలు.

1. పరకాంతాముఖదోషా
కరకాంతి స్పర్శనమునఁగడు మొగుడుచు నా
ధరణీసురు నేత్రంబులు
నరసీజములన్నమాట సహజముగాదే.

—నిరం. 1-58

2. చూపులు వారకామినుల చొక్కపుగుబ్బలపై దువాళపుం
గోపులు నూపరూపమునఁ గోయిలమూఁకలఁబచ్చవిల్లుఁ బూఁ
దూపులు దాఁచిదేహలతతో విహరించెడు మారుఁడోయన
న్మాపులు గాఁగ భూసురకుమారుఁడు నిచ్చలువచ్చు వీథికిన్.

—పైది. 2-19

3. జారచోర ప్రవర్తన జరగదయ్యో
మండలస్ఫూర్తి దిశలెల్ల నిండుకొనియెఁ
గానరాదయ్యెఁ బతిపక్షగౌరవంబు
రాజధర్మంబు తత్ప్రకారంబకాదె.

—పైది. 2-71

4. నిలుపంజాలను నీశివాఖ్యమదిలో నిక్కంబుగా నీ కథల్
పలుకంజాలను వాక్కులన్ వెలయనీపాదాబ్జ సంసేవనల్
గెలువంజాలను దేహకర్మములదుష్కృత్యాత్ముఁడన్ నామన
శ్చలనంబుందొలఁగించి ప్రోవవె శివా! సద్భక్తరక్షాచణా!

—పైది. 3-50

5. సిరులు మించిన పసిడి బంగరు జిలుగుదుప్పటి జారగా
చరణపద్మము మీద దేహము చంద్రకాంతులు దేరగా
మురువుచూపుచు వచ్చినావో మోహనాకృతి మీరగా
గరుడ వాహన! దనుజమర్దన! కందుకూరి జనార్దనా!

—జనార్ద. 1

# పింగళి సూరన

క్రీ.శ. 16వ శతాబ్దికి చెందిన పింగళి సూరనార్యుడు 'కళాపూర్ణోదయము,' 'రాఘవ పాండవీయము,' 'ప్రభావతీ ప్రద్యుమ్నము' అనే గ్రంథాల్ని రచించాడు. 'కళాపూర్ణోదయము' సూరనగారి కల్పనాచాతురికి, 'రాఘవ పాండవీయము' ద్వ్యర్థికవితకు, 'ప్రభావతీ ప్రద్యుమ్నము' ప్రౌఢప్రబంధరచనకు దర్పణాలు. ఈతడు రచించిన 'గరుడ పురాణము,' 'గిరిజా కల్యాణము' అలభ్యాలు. ఇతడు అనన్యప్రతిభాసమన్వితుడు.

1. తమిఁబూఁదీఁగెల తూఁగుటుయ్యెలలఁబంతాలాడుచుందూఁగు నా
కొమరుంబ్రాయపు గబ్బి గుబ్బెతల యంఘ్రుల్ చక్కఁగాఁ జాఁగి మిం
టి మొగంబై చనుదెంచు తీవిగనుఁగొంటే దివ్యమౌనీంద్ర! నా
కమృగీనేత్రల మీఁదఁగయ్యమునకుం గాల్సాఁచులాగొప్పెడున్.

—కళా. 1-43

2. శ్రీయుతమైన దివ్యమణి చేతికినబ్బఁగఁబాఱవైచి త
చ్ఛాయ యొకింతయున్కిఁగని చాలఁగృశించితి గాజుపూసకై
నాయవివేకమేమనుకొనందుదఁదన్మణియబ్బెనన్న న
త్యాయత తత్సమాగమ సుఖాప్తికి నోఁచమినెంచి కుందెదన్.

—పైది. 4-23

3. ఎందువేఁటరారెయితరులేమనసుతో
దారసంగసుఖము దప్పఁద్రోసి
తకట పాండు రాజయశమెన్న వైతతి
క్రూర దశరథేశకులమురోయ.

—రాఘవ. 1-31

4. దోహద ధూపధూమములతోఁ గనుపట్టెడు తత్పురీవన
వ్యూహము సోనమస్త విబుధోత్తమ! చూచితెయంబుపానకొ
తూహలలంబమాననవతోయదరాజి విరాజితాబ్ధి నం
దేహనితాంతకందళనదీపిత నైపుణినేపుఁజూపెడున్.

—ప్రభా. 1-59

5. బింబఫలోష్ఠ కన్నులకు బేడినమీలిరు దిక్కులన్ సమా
నంబుగఁబర్వుచున్న శ్రుతినామసరోయుగ శోభయిట్టు న
ట్టుంబిరు వీఁకు సేయఁగఁగడున్ దమినెందుకుఁగాక రెంటిమ
ధ్యంబునఁబాఱెడిన్ బరువు; లారయఁజాపలమట్టిదేకదా.

—పైది. 2-70

# కుమార ధూర్జటి

క్రీ.శ. 1660 ప్రాంతంలో 'కృష్ణరాయ విజయము' అనే చారిత్రక కావ్యాన్ని ఈకవి రచించాడు. ఈ కావ్యంలో శ్రీకృష్ణదేవరాయలవారి చరిత్ర వర్ణించబడింది. ఈ కవి 'ఇందుమతీ పరిణయము' అనే గ్రంథాన్ని రచించి నరసింహాప్పరాయనికి అంకితమిచ్చాడు. ఈ గ్రంథాలు రెండూ రసవంతాలు. ఇతడు 'సావిత్రీ చరిత్రము'ను కూడా రచించినట్లు తెలుస్తోంది.

1. తత్ప్రదేశంబునందు నెంతయును వింత
మీఱఁగా నొక కుందేలు సారమేయ
మును మహోద్ధతిఁ దఱుము నబ్బురముఁ జూచి
యొౌరయిది యద్భుతంబని యాత్మ నెఱిఁగి.

—కృష్ణ. 2-32

2. ధరణి సామభేదదానదండంబులు
మాయయును నుపేక్షమఱిమహేంద్ర
జాలమును ననంగ సప్తమహోపాయ
ములను దెలియఁదగును ముదమెలర్ప.

—పైది. 2-53

3. వినుపంచలోహములలో
ననుబంగారంబు హెచ్చునందగునటులన్
మనుజులలో సామర్థ్యం
బెనసిన సద్బుద్ధిమంతు నెన్నఁగవలయున్.

—పైది. 2-106

4. నాలుగు దిక్కులం గవిసినట్టడవింజరియించు నచ్చమూ
పాళిగలంగ బల్లెముల బాణములన్ మెఱుఁగీటెగుంపులన్
రాలఁదుపాకులంబలు ఫిరంగుల భంగము నొందఁజేసి గ
గ్గోలుపడం గడంగి యెలగోలు బలంబు చలంబెలర్పఁగన్.

—పైది. 3-71

5. అంతవసంతమెంతయుఁ దనంతననంత మనాంతకాంత వ
న్యాంతికదంతురీభవదనంతలతాంతనితాంతకాంతితో
నంతశకుంత సంతతిహృదంతర సంతతచింతితార్థ భా
స్వంతము పొల్చెనా విరహవంతుల కెంతయు వింతవింతగన్.

—పైది. 4-41

# తెనాలి రామకృష్ణకవి

క్రీ.శ. 1500–75 సంవత్సరకాలంలో ఉన్న రామకృష్ణకవి 'ఉద్భటారాధ్య చరిత్ర,' 'పాండురంగ మాహాత్మ్యము,' 'ఘటికాచల మాహాత్మ్యము' అనే గ్రంథాల్ని రచించాడు. ఈ మూడు గ్రంథాలు దివ్యభావ బంధురాలు. 'పాండురంగ మాహాత్మ్యము' ఈ కవి సర్వోత్కృష్ట ప్రౌఢరచన.

1. ఇనుఁడత్యుత్కటతేజుఁడై మెలఁగి భూయిష్ఠానురాగంబునం
దనుఁజేరంజనుదేరఁగానపరదిక్స్త్రీశిరోరత్నమై
త్తిన నీరాజన మోయనం దదనుషక్తింబుట్టురాగమ్మొ త
త్కనదాశాసతిమేన బల్విరిసెనాఁగన్పట్టె సాంధ్యద్యుతుల్.

—ఘటికా. 2-140

2. కనకోర్వీధరసన్నిభంబగు మహాకాయంబుతో విస్ఫుర
ద్ఘనకాంతిస్ఫుటకుండల ద్వయముతోఁ గౌశేయవస్త్రంబుతోఁ
గనదుత్కంపిత వాలవేష్టనముతోఁగ్రమాంజలి స్ఫూర్తితో
హనుమంతుండపు డేఁగుదెంచి నిలిచెన్ హర్మ్యాగ్రభాగంబునన్.

—ఘటికా. 3-53

3. కాళరాత్రీశుఁడగు నీకుఁగడిఁదితమము
పుండరీకాభుఁడగు నీకు భూరిరజము
సత్కృపాంభోధియగు నీకు సత్త్వభృతియు
ననుగుణంబులు మూర్తిత్రయైక నిలయ.

—పాండు. 2-197

4. శ్రీలాలిత్యము నిత్యశుద్ధియు గుణోత్సేకంబునుంగల్గియు
ద్వేలస్ఫూర్తిఁదలిర్చు తండ్రియనునబ్ధింజంద్రుఁడై తోఁచినన్
బోలుంగాక భవాదృశుండితరుఁడై పుణ్యంబులంబాసినన్
సాలగ్రామఖనిన్ జనించునె కదా జాత్యల్పపాషాణముల్.

—పైది. 3-34

5. కందర్పాస్త్రములంచు నంచిత తటిత్కాండంబులంచున్ సుధా
మందస్యందములంచుఁగాంచనలతామత్తల్లులంచున్ సుధీ
బృందంబుల్ ధ్వనినిందలందెగడు నీబింబోష్ఠులందెల్ల నా
నందాభానమెకాని భాసిత చిదానందంబు పెంపొందునే.

—పైది. 5-225

# 33

## బట్టుమూర్తి (రామరాజభూషణకవి)

క్రీ.శ. 1510 నుంచి 1580 వరకు బట్టుమూర్తి జీవితకాలంగా పరిగణించవచ్చు. అళియ రామరాజుచే సత్కృతుడవటంచేత ఇతనికి 'రామరాజభూషణుఁడు' అనే బిరుదు వచ్చి ఉంటుంది. 'కావ్యాలంకార సంగ్రహము' ('నరసభూపాలీయము,') ; 'హరిశ్చంద్ర నలోపాఖ్యానము,' 'వసుచరిత్రము,' అనే గ్రంథాల్ని ఈ కవి రచించాడు. వీటిలో 'వసుచరిత్రము' సుప్రసిద్ధ ప్రబంధరాజం. ఈ కవికి శ్లేషాలంకారంమీద ధ్వనిమీద ఎక్కువ మక్కువ ఉంది.

1. లలనా జనాపాంగవలనావసదనంగ
   తులనాభికాభంగదోః ప్రసంగ
మలసానిలవిలోల దళసాసవరసాల
   ఫలసాదరశుకాలపనవిశాల
మలినీగరుదనీక మలినీకృతధునీక
   మలినీసుఖితకోకకుల వధూక
మతికాంత సలతాంత లలికాంతరనితాంత
   రతికాంతరణతాంత సుతనుకాంత
మకృతకామోదకురవకావికల వకుల
ముకుల సకలవనాంత ప్రమోద చలిత
కలిత కలకుంఠకులకంఠకాకలీ వి
భాసురము వొల్చు మధుమాస వాసరంబు.

—వసుచ. 1-126

2. అనుపమకాంతి వైభవసమన్వితునా వసురాజుఁగాంచు ప
ద్మిని నరసాంతరంగమున మించె వినూతన రాగకందళం
బొనరె నఖండ వాసనలు నుత్కలికల్విలసిల్లె నల్లన
ల్లన నిగిడెం బమోద తరళ స్థితులై దమిఁజూపు తుమ్మెదల్.

—వైది. 3-48

3. ఔరా! ఓబనృపాలకు
మారా! మనుమదనసమ! రమాధుర్యుఁడవై
ధీరా! నృసింహ! కూడితి
మా రామను మదన సమర మాధుర్యుఁడవై.

—నరసభూ. 4-80

# 34

## పొన్నిగంటి తెలగన

క్రీ.శ. 16 వ శతాబ్ది ఉత్తరార్ధానికి చెందిన పొన్నిగంటి తెలగన 'యయాతి చరిత్రము'ను రచించి అమీనుఖానుకు అంకితమిచ్చాడు. అచ్చతెనుగు గ్రంథాల్లో ఇది మొదటిది, ఉత్తమోత్తమ మైనది.

1. అచ్చతెనుంగుఁ బద్దె మొకటైనను గబ్బములోన నుండినన్
హెచ్చని యాడుచుందురది యెన్నుచునేర్పునఁ బొత్తమెల్ల ని
ట్లచ్చతెనుంగునన్నొడువ నందుల చందమెఱుంగు వారునిన్
మెచ్చరొ యబ్బురం బనరొ మేలనరో కొనియాడరో నినున్.

—యయా. 1-12

2. కనఁదగు తెల్లమానికపుఁ గప్పుల నొప్పెడు చప్పరాలలోఁ
దన పాడవైన నీడఁగని తాళక యేనుఁగటంచుఁ గొమ్ములం
జెనకఁగ వచ్చి కోటపయిఁ జేసిన ముత్తెపు సింగపుంగమిం
గనుఁగొని పాఱువేల్పు దొరగొరతఁడౌదలమన్తరింపఁగన్.

—పైది. 1-77

3. సరగ మిన్నను కమ్మరి సంజకొలిమి
బెట్టుగాఁ గాల్చి బంగారు చుట్టువాలు
పదనువెట్టఁగఁ గొనిపోయి పట్టలేక
విడిచెననఁ బ్రొద్దు పడమటి కడలి మునిఁగె.

—పైది. 2-68

4. చల్లులాడఁగ నప్పుడు చదల నెగసి
మగుడు తెలినీటి తుంపరల్ దగియెఁ జూడ
వారి నీరాటకును మెచ్చి వలపురాయఁ
డానికురియించు పువ్వులవాన లనఁగ.

—పైది. 3-65

5. తామర కెంపులంతటను దాచిన ముక్కలిపీటమీఁదటం
గోమలు లంతఁబెండ్లికొడుకుందగనుంచినఁ బొల్పుమీఱఁగాఁ
బ్రామినుకుందెఱంగు నను రక్కసి యొజ్జయొనంగెఁ గూఁతునున్
గోమలిఁ బెంచు కోర్కి నమకూరుటకుందన బాప మెచ్చఁగన్.

—పైది. 4-105

# 35

## కంకంటి పాపరాజు

క్రీ.శ. 1550 – 1600 మధ్యకాలంలో కంకంటి పాపరాజు 'విష్ణుమాయా విలాసనాటము' అనే యక్షగానాన్ని 'ఉత్తరరామాయణము' అనే మహాకావ్యాన్ని రచించాడు. 'ఉత్తరరామాయణము' పాపరాజు కవితాచాతురినీ వైదగ్ధ్యాన్నీ వెల్లడిస్తోంది.

1. జగములు మూఁడు నాతని వశంబున నున్నవి మాయఁజిక్కి యీ
జగతి ప్రధాన దైత్యసుర సంయములుంగమలాసనుండు నా
దిగఁగల వారలెల్ల వికృతింబడుచుంద్రు తదీయ లీల నే
మగునొసుమీ మహాత్మ జలజాక్షునిచేత భవత్ప్రతాపముల్.

—విష్ణు.

2. దిగ్దంతుల్ నిదురించె నిర్భరతఁ జెందెన్ భూధరంబుల్ మరు
ద్భుగ్నేంద్రుఁడు భోగినీపతి సుఖంబుల్ గాంచె యజ్ఞాంగతి
ర్యగ్గాహంబు శమించె నాటవిడుపైనట్లుండెఁ గూర్మంబు స
మ్యగ్దోర్దండమునన్ ధరాభరము రామక్ష్మావరుండూనినన్.

—ఉత్తర. 1-86

3. అకటా విష్ణుని గెల్చుటో జముని బాహాశక్తి మాయించుటో
సకలాదిత్య వినాశముల్ సలుపుటో శక్రున్ నివారించుటో
వికటవ్యాధి, జరావికారకృశులన్ విభ్రాంతులన్ మర్త్యులన్
బ్రకటక్రోధమునన్ జయించిన వికారంబందరే మాదృశుల్.

—పైది. 3-303

4. పది మోముల్గల దండిరక్కసునినిన్ భంజింప నీలాగు నీ
వుదయంబొందిన నీ పనుల్ నడుప నుద్యోగించి రుద్రాబ్జ గ
ర్భదినేంద్రాబ్జ ముఖామరుల్ పవన భూభల్లూక రాడ్వాను జాం
గద ముఖ్యాగచరత్వముల్ గనిరిగాకాకుత్స్థ వంశాగ్రణీ!

—పైది. 5-71

5. రమణి మఱికొంత వడిదాఁక రథముఁ జూచుఁ
దరుణి మఱికొంతసేపు కేతనముఁ జూచుఁ
గాంత మఱిమీఁద రథపరాగంబుఁ జూచుఁ
బడఁతి మఱియంతటను వట్టి బయలు సూచు.

—పైది. 6-299

# మట్ల అనంతభూపాలుడు

మట్ల అనంతభూపాలుడు క్రీ.శ. 16వ శతాబ్దపు ఉత్తరార్ధానికి చెందిన రాజకవి. ఈ కవి 'కకుత్స్థ విజయము'ను రచించాడు. ఇతడు తన గ్రంథాన్ని తండ్రికి అంకితమిచ్చాడు. ఈతని కవిత్వం హృదయంగమంగా ఉంటుంది.

1. పరమప్రాజ్ఞ సరస్సరిద్వనగిరుల్ ప్రఖ్యాతముల్ సూడమే
నరనారాయణు సంయమి ప్రవర నానాపుణ్యగాథా రహ
స్యరసజ్ఞాపక కీరవృద్ధ సహవాస ప్రీతిదివ్యర్షి భా
స్వరమౌ నా బదరీవనంబు కరణిన్ వాక్రువ్వరేదేనియున్.

—కకుత్. 1-150

2. మిడుఁగుఱు మిన్నులై మెఱయు మేరువులై పొడకట్టు చుక్కలై
పొడవునఁబొల్చు దంతులయిపోయి వడింబరతెంచు మబ్బులై
పిడుగులు రాల్చు గాడ్పులయి బిస్సనవీచు ప్రవాహపంక్తులై
కడలుల ముంచునట్లు వరగర్వము సూపఁగఁదద్రథావళుల్.

—పైది. 2-103

3. ధ్రువమండలమౌదలగా
రవిమండలమడుగు గాఁగ రాజిలు పదునా
లువు లక్షల యోజనముల
భువనము త్రిదివమిది భోగభూమి నృపాలా.

—పైది. 3-6

4. చిలుక యొకటి యతి రయమున
నెలమామిడి చిగురుఁగొమ్మ యెక్కం జతగాఁ
బొలిచెంగెలిచితి గెలిచితి
గెలిచితి నని పలికి కలికి కిలకిల నవ్వెన్.

—పైది. 3-95

5. అనలునిగాఁడుచుం జముని నాఁటుచు రాక్షసువాడు చుంగప
ర్తినొసలు చూఁడుచుం దనుజు ప్రేవులు దోడుచు గాడ్పు కడ్పులో
గునుకులు గోఁడుచున్వరుణు గుండియఁ దేఁడుచు వాహనేంద్రు నం
దినిఁజనవేఁడుచున్నృపతి నేర్పులు దీడుచు వెండివాఁడిగన్.

—పైది. 5-123

# కాకమాని మూర్తికవి

ఈ కవి క్రీ.శ. 16వ శతాబ్ది ఉత్తరార్ధానికి చెందినవాడు. ఇతడు 'పాంచాలీ పరిణయము,' 'రాజవాహన విజయము,' 'బహుళాశ్వచరిత్రము' అనే గ్రంధాల్ని రచించాడు. వీటిలో బహుళాశ్వ చరిత్రము అలభ్యం. ఈయన కవిత్వంలో 'అల్లసానివాని యల్లిక బిగిసొంపు, ముక్కుతిమ్మనార్యు ముద్దుఁబలుకుఁ, బాండురంగనుకవి పద్యంబు హరువును' కలిసి ఉన్నాయి.

1. పూర్వాభ్యస్త శరాసముంబలె గరాంభోజంబునంబట్టివిల్
మౌర్వీధూర్వహనంబుగాఁగ నవలీలన్వంచిపంచాస్త్రత
ద్గీర్వాణాస్త్ర శరవ్యమవ్యయగతింద్రెళ్లంగ నేసెన్ సురల్
శర్వాణీశుఁడె యాతఁడంచు సుమవర్షంబుల్ ప్రవర్షింపఁగన్.

—పాంచాలి. 2–50

2. పాంచాలీ చలదృక్పరాభవ భయభ్రాంతిన్ నిలన్ లేక మి
న్నంచుల్ ప్రాఁకెడు చేపఁజాపలత నేయంబాడియే యిన్నరుం
డంచుందక్కిన బేడిసల్ గవిసెనానప్పార్థుపైఁబౌరభా
మాంచచ్చంచలలోచనాంచల నికాయంబంత వ్రాలెన్ వడిన్.

—పైది. 5–64

3. చల్లనితావినెల్లెడలఁజల్లఁగఁదెమ్మెరలెల్లఁబెల్లుగా
హల్లకముల్ సనిద్రకములై పొరలంజలజాతజాలముల్
మొల్లమినుల్లసిల్లఁదమముందమముందటి చోటుకేఁగఁగా
బల్లునఁదెల్లవారె సుమభల్ల రణార్థులగుండె ఝల్లనన్.

—రాజ. 1–78

4. ఈవికి నిమ్మ, భోగమునకింకువ, చక్కదనంపుఁదేటకున్
దావు, ప్రతాపసంపదకుఁదానక, మంచితసూక్తి నూనపుం
దావికిఁడెంకి, కార్యకలనంబునకిల్లు, రణాంగణాటవీ
పావకు రాజవాహన నృపాల శిఖామణిఁజెప్పనొప్పదే.

—పైది. 2–30

5. అన్నర పాలువాలుగుల కగ్గలమౌ తెలిసోగ కన్నులా
క్రొన్నెల నెన్నొసల్ వెడఁద రొమ్ము చొకారపుతేట చెక్కుల
భ్యున్నత బాహుపీఠి యొఱపున్మెఱపున్మరపించు నంగముం
గన్నులఁగట్టినట్టయినఁగంటికి నిద్దురరాదె నెచ్చెలీ.

—పైది. 4–20

# ఆతుకూరి మొల్ల

క్రీ.శ. 16వ శతాబ్దికి చెందిన ఆతుకూరి మొల్ల రామాయణ గ్రంథాన్ని రచించిన కవయిత్రి. కులాలకులసంజాతయైన ఈమె కేసనసెట్టిపట్టి. ఈమె కవిత్వం సహజ వర్ణన సంభరితమై రసవంతమై సహృదయ హృదయరంజకంగా ఉంది.

1. రాజులు కాంతియందు రతిరాజులు రూపమునందు వాహినీ
రాజులు దానమందు మృగరాజులు విక్రమకేలియందు గో
రాజులు భోగమందు దినరాజులు సంతతతేజమందు రా
రాజులు మానమందు నగరమ్మున రాజకుమారులందఱున్.

—రామా. 1–10

2. ధవళాక్షులను మాట తథ్యంబు గావింపఁ
దెలుపెక్కి కన్నులు తేటలయ్యె
నీలకుంతల లనినెగడిన యామాట
నిలుపంగ నెఱులపై నలుపునూపె
గురుకుచలను మాట నరవి భాషింపఁగఁ
దోరమై కుచముల నీరువట్టె
మంజుభాషిణులను మాటదప్పకయుండ
మెలఁతల పలుకులు మృదువులయ్యెఁ
గామినులటంట నిక్కమై కాంతలందు
మిఱి మేలైన రుచులపైఁగోరికయ్యె
సవతిపోర నఁదమలోన సారె సారె
కోకిలింతలు బెట్టు చిట్టములుఁబుట్టె.

—పైది. 1–42

3. కలదో లేదో యనుచును
బలుమఱు నెన్నడుముఁజూచిపలుకుదురితరుల్
బలిమో కలిమో యనుచును
బలుమఱు జఘనంబుఁజూచి పలుకుదురితరుల్.

—పైది. 3–23

# రఘునాథ నాయకుడు

క్రీ.శ. 1600–31 వరకు తంజావూరు నాయక రాజ్యాన్ని పరిపాలించిన రఘునాథనాయకుడు కవిపండిత పోషకుడు, సంగీత సాహిత్యవిద్యాప్రవీణుడు. ఈ రాజకవి రచించిన 'నలచరిత్ర,' 'రామాయణము,' 'వాల్మీకిచరిత్రము' శ్రీరామచంద్రప్రభువుకు అంకితంచేయబడ్డాయి. ఈ కవిరాజు తనపోషణలోనూ కథాకథనంలోనూ అందెవేసినచేయి.

1. మాటికి రసపరిపాటికి
మేటికవులు మెచ్చి మేలు మేలనఁగూర్తుం
దేటగ రామాయణకథ
మాటలపొందికలు గుమగుమఁబిసాళింపన్.

—రామా. 1–18

2. చెప్పవలెఁగప్పురంబులు
కుప్పలు గాఁబోసినట్లుకుంకుమ పైపై
గుప్పిన క్రియవిరి పొట్లము
విప్పిన గతిఘుమ్మనంగవిత్వము సభలన్.

—వాల్మీకి. 1–15

3. ధరనెన్ని పుణ్యతీర్థములైనఁగలుగనీ
రామనామము సరిరావు తలఁప
నిర్మలస్థితిమించు నిధులెల్లఁగలుగనీ
రామనామము సరిరావు తలఁప
నానావిధములైన దానముల్ గలుగనీ
రామనామము సరిరావు తలఁప
నతిశయంబగు మహావ్రతములు గలుగనీ
రామనామము సరిరావు తలఁప
రామనామంబె సారంబు రామభద్ర
రామచంద్ర రఘూద్వహరామయనుచు
ననయము జపింపవలయుఁదక్కినవి యెల్ల
రామనామంబునకు సరిరావు తలఁప.

—వైది. 1–159

# 40

## చేమకూర వేంకటకవి

ఇతడు క్రీ.శ. 1600-1630 వరకు తంజావూరును పాలించిన రఘునాధరాయల ఆస్థానంలో ఉండేవాడు. ఈ కవి 'సారంగధర చరిత్ర,' 'విజయ విలాసము' అనే గ్రంథాల్ని రచించాడు. ఇతని కవిత్వంలో ప్రతిపద్య చమత్కృతి అనే అసాధారణ లక్షణం ఉంది.

1. అల్లనగాధిరాజసుతుఁడర్మిలి మేనక ముద్దొనర్ప రా
గిల్లికుచంబులానఁ దమకించుటఁ గంటివెరాకుమార యౌ
నల్లనగాధి రాజసుతుఁడర్మిలి మేనక ముద్దొనర్ప రా
గిల్లికుచంబులానఁ దమకించుట బాల్యముగాదె మానినీ.

—సారంగ. 2-79

2. ఆణిమెఱుంగు ముత్తెపు టొయారపు ముగ్గులు, రత్నదీపికా
శ్రేణులు, ధూపవాసనలు, హృద్యనిరంతర వాద్య ఘోషముల్
రాణఁ బొసంగఁ బ్రోలు మిగులంగను విందొనరించు, నిత్యక
ల్యాణముఁ బచ్చతోరణమునై జనులెల్లరు నుల్లసిల్లఁగన్.

—విజయ. 1-83

3. పైపయిఁ గౌతుకంబుదయివాణి యిటుండఁగ, నంత మజ్జనం
బై, పువుఁజప్పరమ్మున నొయారముగాఁ గయిసేసి, దానలీ
లాపరతంత్రుఁడై కలకలన్ నగుచుండెడి సవ్యసాచినిం
ద్రోపలరోచిఁ జూచి తలయూచి, యులూచి రసోచితంబుగన్.

—పైది. 1-128

4. క్షితిపయి వట్టి మ్రాఁకులుఁ జిగర్ప వసంతుడు దారసోపగుం
ఫిత పదవాసనల్ నెఱప, మెచ్చక చంద్రుఁడు మిన్నునన్ బ్రస
న్నతయును సౌకుమార్యము గనంబడ ఱాల్గరఁ గంగఁ జేసెనే
గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా!

—పైది. 1-210

5. కన్నులు దీర్ఘముల్ నగుమొగంబవురా! తలకట్టు తమ్మి పూ
పున్నమ చందమామలకుఁ బొక్కిలి చక్కదనంబుఁ జెప్పఁగా
నున్నదె? మేలుబంతులు పయోధరముల్ చిఱుకౌనుసున్న యౌ
నెన్నిక కెక్కు బ్రాఁతఫలమిప్పర వర్ణినికిన్నిజంబుగన్.

—పైది. 2-104

# కంచెర్ల గోపన్న

క్రీ.శ. 1658-87 వరకు తానీషా రాజ్యపరిపాలన చేయటంచేత 'రామదాసు'గా ప్రసిద్ధుఁడైన కంచెర్ల గోపన్న కొన్ని గేయాల్ని 'దాశరధి శతకము'ను రచించాడు. ఈ శతకం ఆంధ్ర దేశంలో ఆబాలగోపాలంచే చదివి ఆనందించబడుతూ ఉంది.

1. హరునకు నవ్విభీషణున కద్రిజకుందిరు మంత్రరాజమై
కరికి నహల్యకున్ ద్రుపద కన్యకు నార్తి హరించు చుట్టమై
పరఁగిన యట్టి నీపతితపావన నామము జిహ్వపై నిరం
తరము నటింపఁజేయుమిఁక దాశరథీ! కరుణాపయోనిధీ!

—19

2. రాముఁడు ఘోరపాతకవిరాముఁడు సద్గుణకల్పవల్లికా
రాముఁడు షడ్వికారజయరాముఁడు సాధుజనావనో
ద్దాముఁడు రాముఁడే పరమదైవము మాకని మీయడుంగుఁ గెం
దామరలే భజించెదను దాశరథీ! కరుణాపయోనిధీ!

—24

3. సలలిత రామనామ జపసారమెఱుంగను గాశికాపురీ
నిలయుఁడగాను, మీచరణ నీరజరేణు మహాప్రభావముం
దెలియనహల్యఁగాను, జగతీవర! నీదగు సత్యవాక్యముం
దలఁపఁగ రావణాసురుని తమ్ముఁడఁగాను భవద్విలాసముల్
తలఁచినుతింప నాతరమె దాశరథీ! కరుణాపయోనిధీ!

—51

4. వాసవరాజ్యభోగసుఖవార్ధిని దేలు ప్రభుత్వ మబ్బినన్
ఆసకు మేరలేదు కనకాద్రిసమాన ధనంబు గూర్చినం
గాసును వెంటరాదు కనికానక చేసిన పుణ్యపాపముల్
వీసరపోవనీవు పదివేలకుఁ జాలుభవంబు నొల్లనీ
దాసుని గాఁగనేలికొను దాశరథీ! కరుణాపయోనిధీ!

—67

5. భ్రమరము కీటకంబుగొని పాల్పడి ఝూంకరణోపకారియై
భ్రమరముగా నొనర్చునని పల్కుటఁజేసి భవాదిదుఃఖసం
తమసమెడల్చి భక్తి సహితంబుగ జీవుని విశ్వరూప త
త్త్వమున ధరించుటే మరుదు దాశరథీ! కరుణాపయోనిధీ!

—100

# క్షేత్రయ

క్రీ.శ. 17వ శతాబ్దికి చెందిన క్షేత్రయ వాగ్గేయకారుల్లో సుప్రసిద్ధుడు. శృంగార రస బంధురంగా మువ్వగోపాల పదాల్ని అనేకం రచించి ఈ కవి ధన్యుడయ్యాడు. ఈతని పదాల్లో తెలుగుదనం తేటదనాన్ని పొందింది.

పల్లవి :

నీమేను నా మేననుచును — నీమాట నిజమాయెరా

అనుపల్లవి :

ఏమోయనియుంటి — ఎరుగకయిన్నాళ్లు
కోమలాంగ ! మువ్వ — గోపాల ! నినుగూడి ॥నీమేను॥

1. నిన్నెవ్వతోగిల్లి — యున్నయురము జూచి
నన్ను వేదనజేయు — చున్నది గదరా
నిన్న రాతిరి నీకు — నిదుర లేకున్న నా
కన్ను లెర్రగా — గలిగెను గదరా.

2. కోమలాంగిని నీవు — కోరినప్పటినుండి
వేమారు నామది — వెతచెందె గదరా
నీమోవి నొక్కుల — నీటు జూచినయంత
నామోవి యదియేమొ — అదిరింది గదరా.

3. అన్యకాంతను నీవు — అనుభవించితివేమొ
నన్నేలిన దొరా — నాతమిదీరెరా
మన్నించు — గోపాల మళ్ళి నీవిటు రాగ
చిన్నబోయి సిగ్గు — చెందితిని గదరా ॥నీమేను॥

# 43

## కూచిమంచి తిమ్మకవి

క్రీ.శ. 1684 – 1757 మధ్యకాలంలో ఉన్న కూచిమంచి తిమ్మకవి 'కుక్కుటేశ్వర శతకము,' 'రాజశేఖర విలాసము,' 'రుక్మిణీపరిణయము,' 'సింహశైల మాహాత్మ్యము,' 'నీలాసుందరీ పరిణయము,' 'అచ్చతెనుఁగు రామాయణము,' 'సారంగధర చరిత్ర,' 'సాగరసంగ మాహాత్మ్యము,' 'లక్షణసార సంగ్రహము,' 'రసికజన మనోభిరామము,' 'సర్పపుర మాహాత్మ్యము,' 'శివలీలా విలాసము,' 'సుజనమనఃకుముద చంద్రిక' అనే గ్రంథాల్ని రచించాడు. ఈయన 'కవిసార్వభౌమ' బిరుద విరాజితుడు.

1. కొండంత విత్తంబు గూడఁబెట్టిన నైనఁ
బొదలు ధనాపేక్ష వదలిపోదు
స్వర్గాధిపత్యంబు సంభవించిన యేని
బహురాజ్యకాంక్ష యెప్పటికిఁ జనదు
పదివేలు పుత్త్రులఁ బడసినప్పటికిని
పుత్త్రోదయభ్రాంతి పోవదెపుడు
చతురంగ బలముల సంఖ్యముల్ గూర్చిన
సేనాభిలాషమింతైనఁ దీఱ
దహహ! డెందంబు లోపల నంతకంత
కధికమగు నాసయింకేమి యనఁగవచ్చు
భూనుత విలాస! పీఠికాపుర నివాస!
కుముద హితకోటి సంకాశ! కుక్కుటేశ!

—కుక్కు. 64

2. వెలుఁగులఱేఁడు తమ్మి చెలివేడుకకాఁడుతమంబు సూడు చు
క్కలదొర జోడు నిచ్చలును గల్వలరాయిడి కాఁడు కోరి మ్రొ
క్కులు గొనువాఁడు జక్కవలఁ గూరుచు నేరుపుకాఁడు భానుఁడు
జ్వలతరదీప్తులన్మెఱసె వావిరిఁ దూరపుఁ గొండమీఁదటన్.

—రుక్మిణీ. 3-134

3. జగములకునెల్లఁ దల్లియై పొగడుగన్న
మన్నుకాన్పును నీవును గన్నతల్లి
కైవడిని జూచుకొనవలెఁ గాక యిట్టు
తమిని జెఱపట్టియునుచుట తగవె చెప్పుమ.

—అచ్చ.రా. 6-109

# శేషము వేంకటపతి

క్రీ.శ. 1706 నుంచి 1732 వరకు మధురను పాలించిన విజయరంగ చొక్కనాథుని అమాత్య ప్రముఖుడయిన వంగల శీనయ్యకు అంకితంగా 'శశాంక విజయము'ను శేషము వేంకటపతి రచించాడు. 'శశాంక విజయము' శృంగార రసబంధుర కావ్యం. శేషము వేంకటపతి ధారాశుద్ధిగల కవి.

1. ఒప్పుగ నొజ్జయొద్ద శశియుండు తఱిందలు పోరఁజేసి, యా
యొప్పులకుప్ప వానిమెయి యొప్పిదముల్ గను తెప్పవెట్టకే
తప్పక చూచి, కన్మొగిచి, తళుకు తళుక్కనఁ గమ్మలూఁగగాఁ
గొప్పనియాడఁ, జెక్కులు గగుర్పొడువం, దలయూచు మెచ్చుచున్.

—శశాం. 2-72.

2. అలకలు దువ్వరాదు, సరసాన్నములన్ భుజియింపరాదు, మైఁ
గలపమలందరాదు, తిలకంబు రకంబుగ దిద్దరాదు, సొ
మ్మును గయిసేయరాదు, సుమముల్ ధరియింపఁగరాదు సాధ్వియౌ
నలిన దళాయతాక్షికిని నాథుఁడు చెంగట లేకయుండినన్.

—పైది. 2-126

3. కొమ్మగాదిది బంగారు బొమ్మగాని
యింతిగాదిది, జాజిపూబంతిగాని
కలికిగాదిది, మరుని పూములికిగాని
భామగాదిది లావణ్యసీమగాని.

—పైది. 3-24

4. ప్రతిజన్మంబు సుమంగలీత్వగరిమన్ బ్రాపింప నింద్రాణి సు
వ్రతచర్యన్ వరుణానికిన్ రవిహరిద్రాచూర్ణరాశి, న్నభ
స్తతశూర్పంబున వాయనం బొసఁగ ప్రత్యక్సింధువీచీపటా
వృతి యొప్పన్గొని, చల్లు నక్షతలు నాఁబెంపొందెఁదారౌఘముల్.

—పైది. 4-110

5. నారికై పోరు నా నలినారి నారి
మింటసారించి, యుద్ధతి మీఱి, వారి
కందఱకు నన్నిరూపులై యని యొనర్చెఁ
జాపవిద్యా విలాసంబు జగము పొగడ.

—పైది. 5-89

# సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు

ఈ కవి క్రీ.శ. 1735 – 40 మధ్యలో 'అహల్యా సంక్రందనము' అనే గ్రంథాన్ని రచించాడు ఇతడు శ్రీ విజయరంగ చొక్కనాథమహీనాథసత్కృతుడు. 'అహల్యాద్వైకార' అని ప్రశంసించబడ్డ ఇంద్రాహల్యల శృంగార రసాత్మకం ఈ ప్రబంధం ఇది శ్రీరంగనాథునికి అంకితం. ఈ కవి క్రీ.శ. 1728 లో 'రాధికాసాంత్వనము' అనే గ్రంథాన్ని రచించాడు.

1. బాలకురంగనేత్రనునుఁబల్కులకున్ విరివింటివాని బా
బాలకువాదు, పెన్‌దొడల బంగరు రంగు మెఱుంగులంటి కం
బాలకురాదు, నెమ్మొగము బాగల పున్నమచందమామ దం
బాలకుఁ మీఁదు, దానిసరి బాలికలేదు జగత్త్రయంబునన్.

—అహల్యా. 2-16

2. అళికచ ముంగురుల్ గనిన యబ్జములందలి తేంట్లు దూఱెఁ, దొ
య్యలిపలుకుల్ వినంగఁబొదలంతటఁ గోయిలదండు చేరె, నె
చ్చెలికుచకుంభముల్ గనుచుఁ జెట్లకుఁ జక్రములెల్లఁ బాఱెఁగో
మలి నడయందముల్ దెలిసి మానసమున్ వడిఁజేరె హంసముల్.

—పైది. 2-93

3. నాపయి నింతప్రేమ మునినాథునకెన్నఁడుఁగానఁ గావునన్
నాపతి వీవుగావు కుహనాకృతి వెవ్వఁడవో! యెఱుంగ నీ
రూపముఁజూపకూఱకమరుల్ గొని బల్మి యొనర్చితే నే
నైఁప, నిజంబుపల్కు, మిఁకఁ జల్లకువచ్చియు ముంత దాఁతురే.

—పైది. 3-82

4. మృదువై మెల్లనఁ గొంతసేపటికి నద్వృత్తాంతంబు గానౌచుఁ బెం
పొదవన్ గొంత కరంగి సొగయుగుచున్ బొల్పొంది యారాయి చ
క్కదనం బేర్పడి, మోహనాకృతి చెలంగన్, యౌవన శ్రీతగన్
నుదతీరత్నము గాఁగ నిల్చెను, మదిన్ జోద్యంబు వాటిల్లఁగన్.

—పైది. 3-136

5. ఖ్యాతిని నీదు పాదకమలాంచిత రేణురజంబుఁదాల్చ ని
శ్చేతనమైన ఱాతికొక చేతనమబ్బెనటన్న, నట్టిచోఁ
జేతనవృత్తినున్న సురసిద్ధులు సాధ్యులు మౌళిదాల్చి యే
రీతిగనుందురో తెలియరెవ్వరు రామ! భవత్పదంబులన్.

—పైది. 3-143

# ఏనుగు లక్ష్మణకవి

ఈ కవి క్రీ.శ. 18వ శతాబ్దికి చెందినవాడు. ఇతడు 'రామేశ్వర మాహాత్మ్యము,' 'గంగా మాహాత్మ్యము,' 'విశ్వేశ్వరోదాహరణము,' 'నృసింహదండకము,' స్తోత్రములు,' 'విశ్వామిత్ర చరిత్ర,' 'రామవిలాసము,' 'సుభాషితరత్నావళి' అనే గ్రంథాల్ని రచించాడు. సంస్కృతంలోని సుభాషిత త్రిశతికి అనువాదమైన 'సుభాషిత రత్నావళి' నిర్దుష్టమై రసవంతమై ఉంది.

1. విద్య నిగూఢ గుప్తమగు విత్తము, రూపము పూరుషాళికిన్,
విద్య యశస్సు భోగకరి, విద్య గురుండు విదేశబంధుఁడున్,
విద్య విశిష్టదైవతము, విద్యకు సాటి ధనంబు లేదిలన్,
విద్య నృపాలపూజితము, విద్య నెఱుంగనివాఁడు మర్త్యుఁడే.

—సుభా. నీతిశ. 16

2. ఆపదలందు ధైర్యగుణమంచిత సంపదలందుఁ దాల్మియున్,
భూపసభాంతరాళమునఁ బుష్కల వాక్చతురత్వ, మాజి బా
హాపటుశక్తియున్, యశమునందును రక్తియు, విద్యయందు వాం
ఛా పరివృద్ధియున్, బ్రకృతిజన్యగుణంబు లివి సజ్జనాళికిన్.

—పైది. 52

3. నలువ కులాలు భంగి నలిన బ్రభవాండమునందు దేనిచే
నిలిచె, దశావతార వననిష్ఠితుఁడయ్యె మురారి దేనిచేఁ,
బెలుచఁ గపాలహస్తుఁడయి భిక్షకుఁడయ్యెఁ బురారి దేనిచే,
నలరవిదేనిచేఁ దిరుగు నా మనకర్మము వంద్యమేకదా.

—పైది. 92

4. కలిత మనోరథంబు లుదకంబులు, తృష్ణలు భూరి వీచికా
వళు, లనురాగముల్ మకరవర్గము, మోహవితర్కముల్ సుడుల్
పులుఁగులు గాఁగ, ధైర్యఫలభూజము గూల్చు దురాశ పెరి పు
ష్కలనది దాఁటి నిత్య సుఖసంపద గాంతురు యోగిపుంగవుల్.

—సుభా.వైరా. 10

5. స్తనములు మాంసపిండములు చక్కని బంగరు కుండలంచు, నా
ననము కపాలయుంబుతుహినద్యుతి తుల్యమటంచు, మూత్ర భా
జనజఘనస్థలంబుకరి చారుశిరస్సమమంచుఁ, గామినీ
జనమలినాంగముల్ సుకవి చాతురివర్ణనకెక్కె నిమ్మహిన్.

—పైది. 16

# 47

## ముద్దుపళని

క్రీ.శ. 18వ శతాబ్దికిచెందిన ముద్దుపళని 'రాధికా సాంత్వనము' అనే శృంగార ప్రబంధాన్ని రచించి ఖ్యాతిగాంచిన ధీమతి. ఈ ప్రబంధానికే 'ఇళాదేవీయము' అనే నామాంతరం ఉంది. సంగీతసాహిత్య భరతశాస్త్ర ప్రవీణురాలైన ముద్దుపళని కవిత్వం శృంగార రసబంధురంగా హృదయంగమంగా ఉంది.

1. చలువలెసంగు చప్పరపు జంత్రపుబొమ్మలు పావురంబులున్
గిలకిల మంచమున్ విరులు నింపిన సెజ్జయుఁగేఁచుబుఱ్ఱయున్
దలగడదిండ్లు దోమతెర తళ్కును డోలిక నిల్వుటద్దముల్
గలపడకింటికేఁగియటఁగంజవిలోచనుఁడుండె నత్తఱిన్.

— రాధికా. 1-104

2. రాసిఁజేసిన శృంగార రసమనంగఁ
జక్షులకుఁదోఁచుకరుణాతిశయమనంగ
నొకటియైనట్టి మన్మథాయుత మనంగఁ
బొలుచు గోపాలరూపంబు పొగడవశమె.

— పైది. 2-24

3. కావి గాదది విడికెంపు దీవిగాని
దీవి గాదది యమృతంపు బావిగాని
బావిగాదది కపురంపుఁదావిగాని
తావిగాదది శౌరికెమ్మోవి గాని.

— పైది. 2-42

4. ఎల్లజగంబులన్మనుచు నేలిక కంజభవాది మౌని హృ
త్ఫుల్ల సరోజరాజములఁ బూని వెలింగెడి తేజమిందిరా
హల్లక పాణిబాహువుల కబ్బని దివ్యసుఖంబు చిత్రమీ
పల్లవ కామినీ చరణవారిజసేవకు లెస్సఁజిక్కెఁగా.

— పైది. 3-44

5. ఆకాంతామణి యుంగజానలము లోకాతీతమై పర్వ నా
లోకాభీలదృగ శ్రువర్షములు రూరోజాద్రులంగప్పఁగా
శోకోద్రేకముచేఁజెలంగు మొగముస్సోఁకించి తానేడ్చెన
స్తోకోన్మత్త మయూరరాజవిలసత్సువ్యక్త రావంబునన్.

— పైది. 3-85

# దిట్టకవి నారాయణకవి

క్రీ.శ. 1790 సంవత్సర ప్రాంతంలో ఈకవి 'రంగారాయచరిత్రము' అనే చారిత్రకకావ్యాన్ని రచించి మల్రాజు రామాయనింగారికి అంకితమిచ్చాడు. ఈకావ్యంలో క్రీ.శ. 1757లో జరిగిన బొబ్బిలియుద్ధ వృత్తాంతం వర్ణించబడింది. చారిత్రకేతి వృత్తాన్ని కావ్యంగా సర్వాంగ సుంద రంగా నారాయణకవి తీర్చిదిద్దాడు.

1. దేవముని వర్య! తావక పావనాంఘ్రి
జలజసందర్శనానూన సంభ్రమమున
నభిమతార్థంబు లొడఁగూడనంతెకాదు
జన్మసాఫల్యమొదవె మజ్జాతికెల్ల.

—రంగా. 1-73

2. రావుకులాభిమాని బుధరంజన ధర్మగుణప్రధాని నా
నావసుధాది నాయకగణస్తవనీయ యశోనిధాని శౌ
ర్యావనధాయమాన వివిధార్భటి మద్వరసేనిరంగరా
యావని జాని పొల్పెసఁగు నాహవరంగజితారి మానియై.

—పైది. 1-107

3. వెలమలమోము విక్రములు విశ్వధరాస్థలియందు నెల్ల ది
క్కుల వినకారురేచరల గోత్రుల పౌరుషమందు రావు వా
రల భుజశక్తియద్భుత కరంబటుగావున నట్టిదైన యి
క్కులమున (బుట్టి రంగనృప కుంజరుఁడొరసిలంగనొప్పునే.

—పైది. 2-189

4. రణహతవీర యోధతను రక్తతరంగిణు లంబరాంతరాం
గణములు ముంచి పాఱెననగాధ రుచింబొలు పొందెనాత్మజృం
భణము వెలార్చుచుంగడు జపాకుసుమ ప్రతిమానశోణితా
గణితనవీనకాంతి కలికాకలితమ్ములు సాంద్రరాగముల్.

—పైది. 3-136

5. వెంగళరాయ భూవిభుని విశ్రుతకీర్తిని గారవించిత
త్సంగర పాండితీమహిమ తద్విజయోద్దధిమంబునుందదీ
యాంగ బలప్రభావము ముదావహమై పరగన్నుతించియు
చ్చెంగడువేడ్క కొత్త పలిసీమ మొదల్గల కొన్ని రాజ్యముల్.

—పైది. 3-275

# 49

## త్యాగరాజు

క్రీ.శ. 1798 – 1833 మధ్యకాలంలో తంజావూరుకు ప్రభువైన శరభోజీకాలంలో ఉన్న త్యాగరాజస్వామి సుప్రసిద్ధ వాగ్గేయకారుడు, రామభక్తుడు. త్యాగరాజు కీర్తనలు దక్షిణభారత దేశంలో విపుల ప్రచారంలోఉన్నాయి ఈయన 'నౌకాచరిత్రము', 'ప్రహ్లాద భక్తవిజయము' అనే యక్షగానాల్ని కూడా రచించాడు.

1. పల్లవి :

ధ్యానమే వరమైన గంగాస్నానము ఓమనసా! రామ ధ్యానమే

అనుపల్లవి :

వాననీటమునుగ మునుగ లోనివంచన ద్రోహమదాహంకారములుబోనా ॥ధ్యానమే॥

చరణము :

పరధన, నారీమణులను దూరి; పరనిందల, పరహింసలమీరి;
ధరను వెలయు శ్రీరామునికోరి; త్యాగరాజు తెలుసుకొన్న రామ ॥ధ్యానమే॥

2. పల్లవి :

నిధిచాలసుఖమా? రాముని – సన్నిధి సేవసుఖమా నిజముగఁ బల్కు మనసా ॥నిధి॥

అనుపల్లవి :

దధినవ నీతక్షీరములురుచో – దాశరథి ధ్యానభజన సుధారసమురుచో ॥నిధి॥

చరణము :

మమత బంధనయుతనరస్తుతి సుఖమో – సుమతి త్యాగరాజనుతుని కీర్తనసుఖమో ॥నిధి॥

3. ధరలో హరికృత నౌకా
చరితంబును విన్నవారు సన్మార్గముచేఁ
జిరజీవులై చెలంగుచు
వరసుత ధనములను బడసివర్ధిల్లుదురౌ ॥నౌకా॥

# 50

## కందుకూరి వీరేశలింగం

క్రీ.శ. 1848 ఏప్రిల్ 16న జన్మించిన వీరేశలింగంగారు 19వ శతాబ్ది ఉత్తరార్ధంలో సాంఘిక సాహితీరంగాల్లో తమ ప్రభావాన్ని విశేషంగా చూపారు. 'శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచన నైషధము, రసికజనరంజనము, అభాగ్యోపాఖ్యానము, శుద్ధాంధ్రభారత సంగ్రహము, జాన్‌గిల్పిన్, శ్రీ నీతిదీపిక' అనే పద్యగ్రంథాల్ని 'అభిజ్ఞానశాకుంతలము' అనే అనూదిత నాటకాన్ని అనేకప్రహసనాల్ని, నవలల్ని, వ్యాసాల్ని రచించి విశేషవిఖ్యాతిని ఆర్జించారు.

1. నలినము శైవలంబునఁ బెనంగొనియుండియు రమ్యమేయగున్
మలినకళంకముంగలిగి మంజులతన్వహియించుఁ జంద్రుఁడున్
చెలువునమించె నీజలజనేత్రయు వల్కలధారణంబునన్
తలఁపఁగసుందరాంగులకుఁ దానువిభూషణమేదిగాదిలన్.

—అభిజ్ఞాన శాకుం. 1-21

2. చిలుకలు దాయఁలయ్యెనగు చిన్నెలు చూడహంళక్క్రియయ్యె నె
చ్చెలుల నణుంగుటయ్యెఁగడుఁ జీఁకటికన్గొననయ్యె నెల్లచో
నలజడి చూడనయ్యె నలయంచలఁ దిట్టఁగనయ్యెఁ గ్రొన్ననల్
తలనుగడంగి తాలుచుట లాయరుదయ్యె నెలంతకయ్యెడన్.

—శుద్ధాంధ్ర నిరోష్ఠ్య. 1-51

3. అనను ద్రెంపలేకయిటులందని ద్రాఁకులపండ్లకూరకే
వేనరగొంతుసాఁచినను పీసమువాసియుఁ గూడివచ్చునే
మీనరి వారు మెచ్చుకొన మేనుతొఱంగెదనమ్మలార నా
యాసలు నేఁటితో విడువుఁ డందఱుఁగేల్గవ మోడ్చిమ్రొక్కెదన్.

—రసికజన. 2-90

4. అతనికిఁ బొట్టకోసినను నక్షరమొక్కటిలేదు ; కాగడన్
వెతికినఁ దెల్విలేదు ; దయవీసమునుంగలనైనలేదు ; ప్రా
న్నతనయ విద్యలేదు పదునాల్గు పుటంబులు పెట్టికాల్చినన్ ;
జతురత వాతపెట్టినను సత్యము జిహ్వకురాదొకప్పుడున్.

—అభాగ్యో. 25

5. తాతముత్తాత లెంతెంతధనము కూడఁ
బెట్టి పెట్టెలు నిండంగఁ బెట్టియున్నఁ
గష్టపడి తాము న్యాయమార్గమునఁ బడయు
స్వార్జితంబొక గవ్వతో సమముగాదు.

—నీతిదీపిక. 61

# కొన్ని తెలుగుపదాల అర్థాలు

మొదటి అంకె విషయసూచికలో ఇవ్వబడ్డ కవినీ, రెండో అంకె పద్య సంఖ్యనూ, మూడో అంకె పద్యపాదాన్నీసూచిస్తాయి.

| | | |
|---|---|---|
| అగ్గలము | అధికం | 37–5–1 |
| అచ్ఛము | శుద్ధమైన, కల్తీలేని | 17–2–1 |
| అడరు | విజృంభించు | 11–3–3 |
| అని | యుద్ధం | 44–5–3 |
| అర్మిలి | కోరిక | 40–1–1 |
| అఱు | నశించు | 27–5–1 |
| అల | ప్రసిద్ధమైన | 27–5–2 |
| | ప్రసిద్ధుడైన | 46–3–3 |
| అలందు | పూయు | 24–4–1 |
| అలరు | సంతోషించు | 11–3–7 |
| అలుగు | బాణాగ్రం | 13–3–3 |
| అల్లన | మెల్లగా | 40–1–1 |
| అల్లనల్లన | మెల్లమెల్లగా | 33–2–3 |
| ఆసియాడు | చెదరు | 44–1–4 |
| ఆణి | గుండని | 40–2–1 |
| ఆదట | ప్రేమ | 4–3–3 |
| ఆను | పట్టుకొను | 34–4–4 |
| ఇంకువ | స్థానం | 37–4–1 |
| ఇమ్ము | చోటు | 37–4–1 |
| ఇరవు | స్థిరం | 8–3–4 |
| ఈవి | దానం | 20–1–2 |
| ఊరక | ఉత్తనే | 19–1–3 |
| ఊరవడి | అతివేగం | 8–2–3 |
| ఊను | అవలంబించు | 13–2–2 |
| ఎడల్చు | తొలగించు | 41–5–3 |
| ఎత్తు | పూలదండ | 14–1–1 |
| ఎన | సాటి | 1–2–3 |
| ఎనయు | పొందు | 31–3–4 |

| | | |
|---|---|---|
| ఎలగోలు | సేనాముఖంలో ఉండేది | 31–4–4 |
| ఏచు | విజృంభించు | 10–5–1 |
| ఏఁచు | బాధించు | 27–5–4 |
| ఏడుగడయు | సమస్తం | 24–1–2 |
| ఒజ్జ | ఉపాధ్యాయుడు | 44–1–1 |
| ఒడలు | శరీరం | 25–1–6 |
| ఒత్తడి | సమ్మర్దం | 14–1–2 |
| ఒదవు | కలుగు | 4–4–1 |
| ఒనరు | కలుగు | 33–2–3 |
| ఒఱపు | సౌందర్యం | 37–5–3 |
| ఓలి | క్రమం | 1–4–2 |
| ఓరసిలు | తొలగు | 48–3–4 |
| ఔదల | శిరోగ్రం, తల ముందు భాగం | 34–2–4 |
| కట్టావి | వేడివేడిగా ఉన్న | 22–2–2 |
| కడలి | సముద్రం | 36–2–4 |
| కడిఁది | అధికమయిన | 32–3–1 |
| కతన | కారణం | 22–4–3 |
| కదియు | సమీపించు | 14–2–8 |
| కనలు | మండు | 5–3–2 |
| కన్మోగుచు | కళ్ళుమూసుకొను | 44–1–3 |
| కన్మొఱంగు | వంచించు | 22–1–1 |
| కప్పు | ఆచ్ఛాదనం | 34–2–1 |
| కబ్బము | కావ్యం | 34–1–1 |
| కమరు | కాలు | 2–5–3 |
| కమ్మ | తాటంకం | 44–1–3 |
| కయిసేయు | అలంకరించుకొను | 40–3–2 |
| కరణి | విధం, రీతి | 36–1–4 |
| కరవాఁడి | మిక్కిలివాడియైన | 13–3–3 |
| కలంక | జంకు | 24–4–3 |
| కలపము | లేపనద్రవ్య విశేషం | 44–2–2 |
| కలయు | వ్యాపించు | 18–1–8 |

| | | |
|---|---|---|
| కలికి | స్త్రీ | 36–4–4 |
| కవియు | వ్యాపించు | 6–3–4 |
| | కమ్ము | 37–2–3 |
| కమగందు | మిక్కిలివాడు | 28–1–3 |
| కాఁడు | గుచ్చు | 36–5–1 |
| కావి | ఎరుపు | 47–3–1 |
| కుట్టారుగ | చిన్నఅరుగ ధాన్యవిశేషం | 22–2–2 |
| కుందు | కాంతిహీనమగు | 28–1–2 |
| | దుఃఖించు | 30–2–4 |
| కీచుబుఱ్ఱ | అదిమినప్పుడు కీచుకీచని చప్పుడు చేసే తలగడ | 47–1–2 |
| కెమ్మోవి | ఎఱ్ఱనిపెదవి | 47–3–4 |
| కేడించు | యుద్ధంనుంచి తొలగు | 22–3–3 |
| కేల్గవ | రెండుచేతులు | 50–3–4 |
| కొమరు | సొంపు | 28–1–4 |
| కొమ్మ | స్త్రీ | 26–5–3 |
| కొలఁది | పరిమితి | 3–1–6 |
| | శక్యం, సాధ్యం | 18–2–2 |
| కోల | బాణం | 17–3–2 |
| క్రేళిసేయు | పరిహాసంచేయు | 5–5–1 |
| క్రేవు | దూత | 22–2–3 |
| క్రొన్నన | కొత్తపువ్వు | 50–2–3 |
| క్రొవ్విరి | కొత్తపువ్వు | 27–2–4 |
| క్రొవ్వు | అతిశయించు | 27–2–3 |
| గనప | పెద్ద | 13–3–3 |
| గబ్బి | గర్వంగల | 30–1–2 |
| గబ్బు | గర్వం | 18–1–5 |
| గమి | సమూహం | 18–1–2 |
| గాడ్పు | గాలి | 36–2–3 |
| గునుకులుగోఁడు | బాధకలిగించు | 36–5–3 |

| | | |
|---|---|---|
| గుబ్బెత | యువతి | 30–1–2 |
| చదలు | ఆకాశం | 34–4–1 |
| చదలేఱు | గంగానది | 12–1–3 |
| చందము | విధం | 34–1–3 |
| చప్పరము | మండపం | 34–2–1 |
| చల్పు | చేయు | 10–5–4 |
| చవి | రుచి | 23–5–1 |
| చాఁగు | పొడవగు | 30–1-2 |
| చిట్టుములు | గర్భిణీస్త్రీలకు కల్గే అరుచి | 38–2–12 |
| చిందు | వ్యయంచేయు | 22–3–4 |
| చిన్నె | విలాసచేష్ట | 50–2–1 |
| చీకువాలు | చీకటి | 6–3–4 |
| చీఁదఱ | బాధ | 50–2–2 |
| చుట్టువాలు | సుదర్శనం, చక్రాయుధం | 34–3–2 |
| చూఁడు | కాల్చు | 36–5–2 |
| చూడుఁగొడుపు | పసువులకు వాతవేసే ఇనుపకోల | 25–4–3 |
| చెంగలి | సమీపప్రదేశం | 44-2–4 |
| చెచ్చెర | శీఘ్రంగా | 17–2–3 |
| చెనకు | ఎదుర్కొను | 34–2–3 |
| చెన్ను | అందము | 7–2–1 |
| చెలంగు | విజృంభించు | 8–4–4 |
| చెలఁగు | ఒప్పు | 19–2–4 |
| చెలువు | సౌందర్యం | 50–1–3 |
| చెల్వొ | మృదువు | 24–3–2 |
| చొకారము | సుందరం | 37–5–2 |
| చొక్కు | పరవశించు | 14–1–1 |
| చొప్పడు | ఒప్పు | 25–2–1 |
| చొప్పు | పద్ధతి | 19–3–2 |
| చౌకళించు | దాటు | 28–1–1 |
| జన్నిదము | యజ్ఞోపవీతం | 19–5–1 |
| జిలుగు | సన్నని | 29–5–1 |

| | | |
|---|---|---|
| జోక | జతయైనది | 18–1–4 |
| టెంకి | ఉనికిపట్టు | 37–4–3 |
| డగ్గఱు | డమీపించు | 15–5–4 |
| డెంపము | మనస్సు | 43–1–9 |
| తడయు | ఆలస్యం చేయు | 15–54 |
| తద్ద | మిక్కిలి | 15–5–2 |
| తమకించు | ఉత్సహించు | 40–1–2 |
| తమి | ఆసక్తి | 22–2–3 |
| | కుతూహలం | 25–1–4 |
| తమ్మి | తామరపువ్వు | 14–3–1 |
| తలిర్చు | ఒప్పు | 32–4–2 |
| తాఁచు | తన్ను | 24–3–1 |
| తానకము | స్థానం | 37–4–2 |
| తాల్మి | ఓర్పు | 46–2–1 |
| తావి | సువాసన | 16–4–3 |
| తిగుచు | లాగు | 1–3–4 |
| తిరు | పవిత్రమైన | 41–1–1 |
| తిరుగు | ప్రవర్తించు | 26–2–4 |
| తీడు | ప్రకటించు | 36–5–4 |
| తుఱుము | ముడుచు | 24–4–2 |
| తూఁగు | ఊగు | 30–1–1 |
| తూఁగుటుయ్యెల | ఉయ్యాల మంచం | 30–1–1 |
| తూఁటు | రంధ్రం | 19–1–3 |
| తూపు | బాణం | 16–3–2 |
| తెగడు | నిందించు | 32–5–3 |
| తెమ్మెర | చల్లగాలి | 37–3–1 |
| తేఁటి | తుమ్మెద | 45–2–1 |
| తేఁడు | పండుకొను | 36–5–3 |
| తేరు[1] | రథం | 17–5–1 |
| తేరు[2] | కలుగు | 29–5–2 |
| తొడరు | ఉద్యమించు | 11–3–4 |

| | | |
|---|---|---|
| తొరుఁగు | జారు | 9–1–3 |
| | రాలు | 27–2–3 |
| తొఱంగు | విడుచు | 50–3–3 |
| తోరము | అధికం | 27–4–2 |
| | స్థూలం | 38–2–6 |
| త్రెళ్లు | విరుగు | 37–1–3 |
| దయివాఱు | ఎక్కువ అగు | 40–3–1 |
| దాయ | శత్రువు | 50–2–1 |
| దీమము | ఎర ఉంచిన బోను | 14–1–4 |
| దువాళపుంగోపు | గంతేసూది | 29–2–1 |
| దూరు | నిందించు, తిట్టు | 49–1–3 |
| దైవాఱు | ఎక్కువ అగు | 3–1–4 |
| నలువ | బ్రహ్మ | 46–3–1 |
| నాఁటు | చీల్చు | 36–5–1 |
| నారసము | బాణం | 13–3–9 |
| నిగుడు | అతిశయించు | 4–1–4 |
| నిచ్చలు | ఎల్లప్పుడు | 29–2–4 |
| నెగడు | ప్రసిద్ధికెక్కు | 38–2–3 |
| నెన్నడ | చక్కని నడక | 27–4–1 |
| నెయ్యపుఁ గిన్క | ప్రణయ కోపం | 24–3–1 |
| నెఱులు | వెంట్రుకలు | 38–2–4 |
| నెలంత | స్త్రీ | 50–2–4 |
| నెలఁత | స్త్రీ | 22–4–1 |
| నేమము | నియమం | 8–2–3 |
| నొడువు | రచించు | 34–1–3 |
| పడమటి కడలి | పశ్చిమ సముద్రం | 34–3–4 |
| పడయు | పొందు | 49–3–4 |
| పచరించు | చాపు | 5–5–3 |
| పచ్చవిల్లు | చెరుకుధనువు | 29–2–2 |
| పనుల్గొను | సేవింపచేసికొను | 24–5–2 |
| పర్వు | వ్యాపించు | 30–5–2 |

| | | |
|---|---|---|
| పఱవు | విస్తీర్ణము | 22–1–3 |
| పాటి | స్థిరపరచబడ్డ కుంచం మొదలైన వాని పరిమాణం కలది | 3–1–7 |
| పాటించు | ప్రమాణంగా కొను | 3–1–8 |
| పాటిల్లు | కలుగు | 45–4–4 |
| పాయు | విడుచు | 2–1–1 |
| పాఱు | ప్రసరించు | 19–1–4 |
| పిరువీకుసేయు | పెనగిలాగు | 30–5–3 |
| పిసాళించు | వ్యాపించు | 39–1–4 |
| పెన్నెఱిగొప్పు | పొడుగు వెంట్రుకల జుట్టుముడి | 27–4–1 |
| పెలుచ | అధికం | 46–3–3 |
| పెల్లు | అధికం, ఎక్కువ | 37–3–1 |
| పేరలుక | అధిక కోపం | 24–2–4 |
| పైదలి | స్త్రీ | 11–1–2 |
| పొక్కిలి | బొడ్డు, తెలుగు అక్షరాల అవయవ విశేషం | 40–5–2 |
| పొదలు | కలుగు | 43–1–2 |
| పొరంటు | తిరగబోయు | 22–2–2 |
| పొలుచు | శోభిల్లు | 36–4–3 |
| పొల్చు | శోభిల్లు | 33–1–12 |
| పొలుపొందు | ఒప్పు | 48–4–2 |
| పొల్పెసఁగు | ఒప్పు | 48–2–4 |
| ప్రామినుకు | వేదం | 34–5–3 |
| ప్రొద్దు | సూర్యుడు | 34–3–4 |
| బడిబడి | మాటిమాటికి | 27–4–3 |
| బాబా | వాహనం | 45–1–1 |
| మగుడు | మరలు | 34–4–2 |
| మనుచు | రక్షించే | 47–4–1 |
| మన్నుకాన్పు | భూపుత్రి, సీత | 43–3–1 |
| మరుల్గొను | మోహంపొందు | 45–3–3 |
| మలంగు | పక్కకు తిరుగు | 9–4–3 |

| | | |
|---|---|---|
| మస్తరించు | తట్టు | 34–2–4 |
| మానికము | రత్నం | 34–2–1 |
| మాను | మనోహరం | 3–3–3 |
| | యుక్తం | 7–4–2 |
| మాయించు | అణచు | 35–3–1 |
| మారుఁడు | మన్మథుడు | 29–2–3 |
| మార్కొను | ఎదుర్కొను | 5–2–2 |
| మిసిమింతుఁడు | అలసినవాడు | 13–3–8 |
| మురువు | అందం | 29–5–3 |
| మెయి | విధం | 2–2–4 |
| | శరీరం | 22–2–3 |
| మెలఁగు | ప్రవర్తించు | 32–1–1 |
| మెలఁత | స్త్రీ | 38–2–8 |
| మైలారు | క్షుద్రదేవతా విశేషం | 13–3–12 |
| మొగి | ఉత్సాహం | 16–3–4 |
| మొగుడు | ముడుచుకొను | 2–5–4 |
| మొదలెత్తు | మిక్కిలి నశించు | 5–2–3 |
| మొదవు | ఆవు | 20–5–1 |
| మొప్పె | మూర్ఖుడు | 20–2–3 |
| మొల్లమి | పెంపు | 37–3–3 |
| మోడ్చు | చేతులు జోడించు | 50–3–4 |
| మోవి | పెదవి | 42–2–3 |
| రక్కసియొజ | రాక్షస గురువు, శుక్రాచార్యుడు | 34–5–3 |
| రాణ | ఆధిక్యం | 40–2–3 |
| రాయిడికాఁడు | ఉపద్రవం చేసేవాడు | 43–2–2 |
| రోయు | అసహ్యపడు | 30–3–4 |
| లాగు | విధం | 30–1–4 |
| లేమి | దారిద్ర్యం | 27–3–4 |
| వగచు | ఆలోచించు | 1–2–1 |
| వలపురాయఁడు | మన్మథుడు | 34–4–3 |
| వలిపము | తెల్లని వస్త్రం | 24–4–1 |
| వాక్రుచ్చు | పొగడు, ప్రశంసించు | 36–1–4 |